VOL. 2.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర భారతము.

## ఆరణ్యపర్వము.





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము.



1915.

V. RAMASWAMY SASTRULU & SONS, MADRAS.

# విషయసూచిక.

## ఆరణ్యపర్వము - ప్రథమాశ్వాసము.


| విషయము. | | | | పుట. |
|---|---|---|---|---|
| శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మంబులు సెప్పుట | ... | ... | ... | 3 |
| ధర్మరాజు సూర్యు నారాధించి వరంబుఁ గొనుట | ... | ... | ... | 6 |
| విదురుఁడు ధృతరాష్ట్రుని విడిచి పాండవులయొద్దకుఁ బోవుట | | ... | ... | 7 |
| ధృతరాష్ట్రునకు వ్యాసుఁ డింద్రసురభిసంవాదంబు సెప్పుట | | ... | ... | 10 |
| మైత్రేయుఁడు దుర్యోధనుని శపియించుట | ... | ... | ... | 12 |
| కిమ్మీరుం డనురాక్షసుఁడు భీముచేఁ జచ్చుట | ... | ... | ... | 14 |
| యాదవపాంచాలాదులు పాండవుల కడ కేతెంచుట | | ... | ... | 14 |
| ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దనపరిభవంబు సెప్పి దుఃఖించుట | | ... | ... | 16 |
| కృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకోపాఖ్యానంబు సెప్పుట | | ... | ... | 18 |
| సాల్వుఁడు ప్రద్యుమ్నునిచే బాధితుం డై మరలి పోవుట | | ... | ... | 21 |
| పాండవులు ద్వైతవనంబునకు వచ్చి యుండుట | ... | ... | ... | 23 |
| ద్రౌపదీ ధర్మరాజుల సంవాదము | ... | ... | ... | 25 |
| భీమసేన ధర్మరాజుల సంవాదము | ... | ... | ... | 29 |
| కృష్ణద్వైపాయనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట | ... | ... | ... | 32 |
| ఈశ్వరుండు గిరాతవేషంబున నర్జునునొద్దకు వచ్చుట | ... | ... | ... | 36 |
| అర్జునుఁడు పరమేశ్వరుని స్తోత్రము సేయుట | ... | ... | ... | 38 |
| ఇంద్రుఁడు దేవగణంబులతో నర్జునునకుఁ బ్రత్యక్షం బగుట | | ... | ... | 40 |
| అర్జునుఁ డమరావతికిఁ బోవుట | ... | ... | ... | 41 |
| ఊర్వశి యర్జును నపుంసకునిఁగా శపించుట | ... | ... | ... | 44 |


## ఆరణ్యపర్వము - ద్వితీయాశ్వాసము.


| | | | | |
|---|---|---|---|---|
| ధర్మరాజునకు బృహదశ్వుండు నలోపాఖ్యానంబు సెప్పుట | | ... | ... | 49 |
| నలుఁడు దమయంతియొద్దకు దేవదూత యై పోవుట | ... | ... | ... | 53 |
| నలుండు స్వయంవరలబ్ధ యైనదమయంతిం బెండ్లి యగుట | | ... | ... | 55 |
| నలుండు దమయంతీసహితుం డై యడవికిఁ బోవుట | ... | ... | ... | 56 |
| దమయంతిశాపంబునం గిరాతుండు సచ్చుట | ... | ... | ... | 59 |
| దమయంతి సుబాహుపురంబు ప్రవేశించుట | ... | ... | ... | 61 |
| నలుఁడు గర్కోటకునిచేత దష్టుం డగుట | ... | | ... | 63 |
| చేదిపురంబున సుదేవుఁ డనుబ్రాహ్మణుఁడు దమయంతి నెఱుంగుట | ... | | ... | 65 |
| దమయంతి నలు నెడఁబాసి విదర్భాపురంబు సేరుట | ... | ... | ... | 67 |
| నలుండు గలిచేత విముక్తుం డై విదర్భకుఁ బోవుట | ... | ... | ... | 70 |
| కేశిని యనుదూతి దమయంతితో నలునిగుణంబులు సెప్పుట | | ... | ... | 72 |
| నలుండు నిజరూపంబుతో దమయంతిం గూడుట | ... | ... | ... | 74 |

| విషయము. | పుట. |
|---|---|
| ధర్మరాజునొద్దకు నారదమహాముని వచ్చుట ... ... ... | 76 |
| లోమశమహాముని ధర్మరాజునొద్దకు వచ్చుట ... ... ... | 86 |
| లోమశుండు ధర్మరాజునకు ధర్మవిశేషంబులు సెప్పుట ... ... | 88 |
| అగస్త్యుండు లోపాముద్రను వివాహం బగుట ... ... ... | 90 |

## ఆరణ్యపర్వము - తృతీయాశ్వాసము.

| | |
|---|---|
| అగస్త్యచరిత్రము ... ... ... ... ... | 94 |
| దేవతలు వైకుంఠమునకుఁ బోయి విష్ణుని స్తుతియించుట ... ... | 95 |
| అగస్త్యుఁడు వింధ్యంబు పెరుఁగకుండ వారించుట ... ... ... | 96 |
| అగస్త్యుఁడు సముద్రోదకంబు పానంబుసేయుట ... ... ... | 97 |
| భగీరథుండు సముద్రము జలముచే నించుట ... ... ... | 98 |
| సగరసుతులు గపిలమహామునికోపాగ్నిచే భస్మ మగుట ... ... | 100 |
| లోమశుఁడు ధర్మజునకు ఋశ్యశృంగుచరిత్రము సెప్పుట ... ... | 103 |
| ఋశ్యశృంగుఁడు వేశ్యను మునికుమారునిఁగా భావించుట ... ... | 104 |
| విభాండకుఁడు ఋశ్యశృంగుని వెదకుచు వచ్చుట ... ... ... | 106 |
| అకృతవ్రణుఁడు ధర్మరాజునకుఁ బరశురామునిమహిమ సెప్పుట ... ... | 107 |
| పరశురాముఁడు కార్తవీర్యునిఁ జంపుట ... ... ... | 110 |
| లోమశుఁడు ధర్మజునకు సౌకన్యాఖ్యానంబు చెప్పుట ... ... ... | 113 |
| చ్యవనుఁ డాశ్వినుల సోమపీథులఁ జేయుట ... ... ... | 114 |
| మాంధాతృచరిత్రము ... ... ... ... ... | 115 |
| సోమకుం డనురాజర్షిచరిత్రము ... ... ... ... | 116 |
| శిబి యనురాజర్షిచరిత్రంబు లోమశుఁడు ధర్మజునకుఁ జెప్పుట ... ... | 118 |
| లోమశుఁడు ధర్మజునకు నష్టావక్రుచరితంబు చెప్పుట... ... ... | 120 |
| లోమశుఁడు ధర్మరాజునకు యవక్రీతుచరిత్రంబు చెప్పుట ... ... | 121 |
| దేవత లర్వావసునకు మెచ్చి కోరినవరంబులెల్ల నిచ్చుట ... ... | 124 |
| పాండవులు గంధమాదనపర్వతంబునకుం బోవుట ... ... ... | 126 |
| భీముఁడు సౌగంధికహరణార్థంబు పోవుట ... ... ... | 129 |
| భీమునకు హనుమంతుండు చతుర్యుగాచారవర్తనంబులను దెలుపుట ... ... ... | 131 |
| హనుమంతుఁడు భీమునకుఁ దన పూర్వరూపంబుఁ జూపుట ... ... | 132 |
| భీముఁడు యక్షరాక్షసులతో యుద్ధంబు సేయుట ... ... ... | 135 |
| భీముఁడు జటాసురునితో యుద్ధంబు సేయుట ... ... ... | 137 |

## ఆరణ్యపర్వము - చతుర్థాశ్వాసము.

| | |
|---|---|
| ఇంద్రుండు పాండవులయొద్దకు వచ్చుట ... ... ... | 143 |
| అర్జునుఁడు నివాతకవచు లనురాక్షసుల జయించిన కథ ... ... | 145 |
| అజగరోపాఖ్యానము ... ... ... ... ... | 149 |
| ధర్మరాజు భీమసేనుని వెదకఁబోవుట ... ... ... ... | 150 |
| ధర్మరాజు నహుషప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చుట ... ... | 152 |
| శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట ... ... | 155 |
| మార్కండేయుం డనుమహాముని పాండవులయొద్దకు వచ్చుట ... ... | 156 |
| మార్కండేయుఁడు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట ... ... | 159 |
| అత్రిగౌతముల పరస్పరసంవాదము ... ... ... ... | 160 |

విషయము. పుట.


మార్కండేయుండు ధర్మరాజునకు వైవస్వతువృత్తాంతంబును జెప్పుట ... 163
మార్కండేయుండు ధర్మరాజునకుఁ బ్రళయప్రకారంబు సెప్పుట ... ... 165
నారాయణుఁడు మార్కండేయునకుఁ దనప్రభావంబు సెప్పుట ... ... 168
మార్కండేయుండు ధర్మరాజునకుఁ గలియుగధర్మంబులు సెప్పుట ... ... 170
కలియుగంబున విష్ణుండు కల్కిరూపంబున ధర్మంబు ప్రతిష్ఠించుట ... ... 172
మార్కండేయుండు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట ... ... 173
,, ,, ఇంద్రద్యుమ్నుచరిత్రము సెప్పుట ... 178
,, ,, కువలాశ్వుచరిత్రము సెప్పుట ... ... 179
,, ,, మధుకైటభులచరిత్రము సెప్పుట ... 182


## ఆరణ్యపర్వము - పంచమాశ్వాసము.


ధర్మజునకు మార్కండేయుఁడు పుత్త్రునకుండఁ దగుగుణంబులం జెప్పుట ... 186
మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతామాహాత్మ్యంబు సెప్పుట ... 187
కౌశికుం డనుబ్రాహ్మణుఁడు ధర్మవ్యాధునియొద్దకుఁ బోవుట ... ... 189
ధర్మవ్యాధుఁడు గౌశికున కహింసాస్వరూపంబు సెప్పుట ... ... 192
ధర్మవ్యాధుఁడు గౌశికునకు జీవలక్షణంబులు సెప్పుట. ... ... 193
ధర్మవ్యాధుఁడు గౌశికునకుఁ దనపూర్వజన్మవృత్తాంతంబు సెప్పుట ... ... 199
మార్కండేయుఁడు ధర్మజునకు నంగిరసుం డగ్ని యైనతెఱంగు సెప్పుట ... 201
ఇంద్రుఁడు కేశి యనురాక్షసునిఁ బాఱఁ దోలుట ... ... ... 205
కుమారస్వామియవతారము ... ... ... ... 208
ఇంద్రుఁడు కుమారస్వామిపై నెత్తివచ్చుట ... ... ... 209
ఈశ్వరుండు కుమారస్వామియొద్దకు వచ్చుట ... ... ... 212
కుమారస్వామి సప్తమాతృకలబాలగ్రహంబులఁ జేయుట... ... ... 213
ఈశ్వరుండు గుమారసహితుం డై భద్రవటంబు సేరుట ... ... ... 215
కుమారస్వామి మహిషాసురుం జంపుట ... ... ... 216
సత్యాద్రౌపదీసంవాదము ... ... ... ... 219
ద్రౌపది సత్యభామకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట ... ... ... 221
ధృతరాష్ట్రుఁడు పాండవుల వనవాసక్లేశంబునకు దుఃఖించుట ... ... 223
కర్ణశకునిదుర్యోధనులు మంతనంబు సేయుట ... ... ... 225
కర్ణసౌబలులు ధృతరాష్ట్రుచేత ఘోషయాత్ర కనుజ్ఞ గొనుట ... ... 226
దుర్యోధనుఁడు ఘోషయాత్రఁ బోవుట ... ... ... 228
చిత్రసేనుం డనుగంధర్వరాజు దుర్యోధనునితో యుద్ధము సేయుట ... ... 230
భీమార్జుననకులసహదేవులు గంధర్వులతో యుద్ధంబు సేయుట ... ... 233
చిత్రసేనుఁడు ధర్మరాజునొద్దకువచ్చి దుర్యోధనుని విడిచిపెట్టిపోవుట ... ... 235


## ఆరణ్యపర్వము - షష్ఠాశ్వాసము.


దుర్యోధనుని విషాదము ... ... ... ... 237
దుర్యోధనుండు ప్రాయోపవేశము సేయఁ బూనుట ... ... ... 239
ప్రాయోపవిష్టుం డైనదుర్యోధనునిఁ గృత్య పాతాళంబునకుఁ గొనిపోవుట ... 242
దుర్యోధనుఁడు ప్రాయోపవేశము మాని కరిపురంబునకుఁ బోవుట ... ... 244
దుర్యోధనుఁడు వైష్ణవం బనుయజ్ఞము సేయుట ... ... ... 246
ద్వైతవనంబునందలి మృగసమూహము ధర్మజుస్వప్నమునందు వచ్చి తమదుఃఖంబు సెప్పుట. 248

| విషయము. | పుట. |
|---|---|
| వ్యాసుఁడు ధర్మజునకు వ్రీహిద్రోణాఖ్యానంబు సెప్పుట ... ... | 250 |
| ముద్గలునకు దేవదూత పుణ్యలోకంబు తెఱంగు సెప్పుట ... ... | 252 |
| సైంధవుఁడు ద్రౌపదిం జూచి మోహించుట ... ... ... | 253 |
| ద్రౌపది సైంధవునితో నిష్ఠురోక్తులు వలుకుట ... ... ... | 257 |
| సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కారముగా నెత్తికొని పోవుట ... ... | 258 |
| పాండవు లేవురు సైంధవుపై యుద్ధమునకుఁ బోవుట ... ... ... | 260 |
| అర్జునుఁడు సౌవీరకుమారులం బన్నిద్దఱిఁ జంపుట ... ... ... | 263 |
| భీముఁడు సైంధవుం బట్టికొని పరిభవించుట ... ... ... | 265 |
| ధర్మజునకు మార్కండేయుఁడు రామాయణకథ సెప్పుట ... ... | 267 |
| బ్రహ్మ రావణకుంభకర్ణవిభీషణులకు వరంబులిచ్చుట ... ... ... | 269 |
| దశరథుఁడు రామవిశ్లేషముచే సురలోకగతుం డగుట... ... ... | 271 |
| మారీచుఁడు మాయామృగం బై చనుదెంచుట ... ... ... | 274 |
| రావణుఁడు సీత నెత్తికొని లంకకుఁ బోవుట ... ... ... | 276 |
| శ్రీరాముఁడు కబంధుఁ డనురాక్షసుం జంపుట ... ... ... | 278 |
| వాలిసుగ్రీవుల యుద్ధము ... ... ... ... | 280 |
| త్రిజట తనస్వప్నవృత్తాంతము సీతతోఁ జెప్పుట ... ... ... | 282 |

## ఆరణ్యపర్వము - సప్తమాశ్వాసము.

| | |
|---|---|
| రాముఁడు లక్ష్మణుని సుగ్రీవునొద్దకుఁ బంపుట ... ... ... | 285 |
| హనుమంతుఁడు రామునితో సీతం జూచిన వృత్తాంతంబు సెప్పుట ... ... | 287 |
| వానరవీరులు నానాదేశంబులనుండి సుగ్రీవునొద్దకు వచ్చుట ... ... | 289 |
| రాముఁడు దర్భశయనుం డై సముద్రుం బ్రార్థించుట ... ... ... | 290 |
| అంగదురాయబారము ... ... ... ... | 292 |
| ప్రహస్తధూమ్రాక్షుల యుద్ధము ... ... ... ... | 294 |
| కుంభకర్ణుఁడు యుద్ధము సేయుట ... ... ... ... | 296 |
| ఇంద్రజిత్తు లక్ష్మణునితోడ యుద్ధము సేయుట ... ... ... | 298 |
| ఇంద్రజిత్తు లక్ష్మణునిచేతఁ జచ్చుట ... ... ... ... | 301 |
| శ్రీరాముఁడు రావణాసురుని సంహరించుట ... ... ... | 302 |
| మార్కండేయుఁడు ధర్మజునకు సావిత్ర్యుపాఖ్యానంబు సెప్పుట ... ... | 305 |
| సావిత్రి సత్యవంతుని వివాహం బగుట... ... ... ... | 307 |
| సత్యవంతుఁడు సావిత్రీసహితుండై వనంబునకుఁ బోవుట ... ... | 309 |
| సావిత్రి యమునివలన నభీష్టవరంబులు వడయుట ... ... ... | 311 |
| సత్యవంతుఁడు సావిత్రితోడ మరలి తనయాశ్రమంబునకు వచ్చుట ... ... | 314 |
| సూర్యుఁడు బ్రాహ్మణవేషంబునఁ గర్ణునకు హితంబు సెప్పుట ... ... | 316 |
| సూర్యుఁడు గర్ణునితో నింద్రుచే శక్తిఁ గైకొను మని చెప్పుట ... ... | 319 |
| కుంతి దుర్వాసునకుఁ బరిచర్య సేయుట ... ... ... | 320 |
| కుంతి సూర్యునివరంబున గర్భంబుఁ దాల్చి కర్ణుం గాంచుట ... ... | 323 |
| ధర్మరాజు బ్రాహ్మణునియరణి దెచ్చుటకుఁ బోవుట ... ... ... | 327 |
| నకులాదులు యక్షుని నిరాకరించి నీరు ద్రావి మూర్ఛితు లగుట ... ... | 328 |
| ధర్మరాజు యక్షప్రశ్నముల కుత్తరంబు లిచ్చుట ... ... ... | 332 |



శ్రీ

గణేశశారదాగురుభ్యో నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆరణ్యపర్వము - ప్రథమాశ్వాసము.



క. శ్రీ కీర్తిశ్రీ[1]వల్లభ
లోకజనస్తుత్య సర్వలోకాశ్రయ ర
త్నాకరపరివృతసకలధ
రాకాంత జితారి రాజరాజనరేంద్రా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు పాండవులు నిజాయుధంబులు ధరియించి కృష్ణాసహితులై [2]యుత్తరము ఖించి యరిగిన నింద్రసేనాదులైనమూలభృత్యులు పదునాలుగువేలరథంబులతోడ సుభద్రాభిమన్యు ప్రతివింధ్యాదులం దోడ్కొని వారిపిఱుందన యరిగి రంత నప్పాండవులంజూచి పౌరులెల్లఁ బరమదుఃఖితులై. 2

క. చనునె [3]యధర్మద్యూతం, బున నిట్టుల పాండురాజపుత్త్రులఁ బ్రభులన్
వనగతులఁ జేయ దుర్యో, ధనధృతరాష్ట్రులకు విగతదయహృదయులకున్. 3

క. క్రూరతరధార్తరాష్ట్రుని, కారము వారింప రైరి గాంగేయుఁడు న
బ్భారద్వాజుఁడుఁ గృపుఁడు ను, దారుఁడు విదురుండు నేమిదలఁచిరొ బుద్ధిన్. 4

సీ. కర్ణజయద్రథగాంధారు లాప్తులై, యుండంగ లోభి దుర్యోధనుండు
రాజు గా నీతనిరాజ్యంబునం దెట్లు, లుండంగ నేర్తుమీ[4]యుర్వి నింక
నేది ధర్మువు ప్రజ నెవ్వరు గాతురు, పరమధార్మికులైనపాండుసుతుల
యరిగినచోటిక యరుగుద మని వారి, పిఱుఁదన చని పాపభీతమతులు

ఆ. వీరులార మమ్ము విడిచి మీ కరుగంగఁ, జనునె మాకు నొండుశరణ మెద్ది
సాధులకు నసాధుసహవాసమునఁ బాప, సంప్రయోగ మగుట సందియంబె. 5

క. తిలలును నీళ్లును వస్త్రం, బులుఁ బుష్పసుగంధవాసమున సౌరభముం

1 విభవా...సర్వలోకప్రియ. 2 యుత్తరమించి ; యుత్తరించి. 3 యధర్మదురోదర,మున.
4 యుర్వియంను, నెట ధర్మువు.

బోలు పెసఁగఁ దాల్చుఁ గావున, నలయక సత్సంగమమున నగు సద్గుణముల్.

వ. సాధుసమ్మతంబు లైనగుణంబుల నొప్పి జన్మవిద్యాకర్మంబులం బ్రశస్తుల రై
యార్యవృత్తుల రైనమీసహవాసంబున నుండి [1]కృతార్థుల మగుదుము దుష్కృ
తంబులయం దనారంభు లయ్యును జనులు దుర్జనదర్శనస్పర్శనసంభాషణసహా
సనంబులం జేసి ధర్మవిహీను లగుదురు గావున నేము దుర్యోధనురాజ్యంబున
నుండ నోపము మాయనుగమనంబున కొడంబడవలయు నని కృతాంజలు లైన
నప్పౌరులం జూచి ధర్మతనయుం డిట్లనియె. 7

క. మాయందు లేనిగుణములు, మీయనురాగమునఁ జేసి మిగిలి వెలింగెన్
మీయనుగతి మాకు నభి, ప్రాయము వనవాసదుఃఖభర [2]మోపుదురే. 8

తే. వలవ దుడుగుండు మీ రని వారి నెల్లఁ, గరుణఁ బాండవజ్యేష్ఠుండు గ్రమ్మఱించెఁ
బౌరు లట్లు నివర్తింపఁ బడి నిరంత, రార్తనాదు లై యరిగిరి హస్తిపురికి. 9

వ. ఇట్లు [3]పాండవులు గృతప్రస్థానులై గంగాతీరంబునం బ్రమాణాఖ్యవటంబున
విడిసి గంగాస్నానంబు సేసి నాఁటిపగలును రాత్రియు నందయుండి రంతఁ బ్రభాత
సమయంబున. 10

చ. పరువడి నగ్నిహోత్రములు బంధులు శిష్యులుఁ దోడ రా మహీ
సురవరు లెల్లఁ బాండునృపసూనులయొద్దకుఁ బ్రీతి నేఁగుదెం
చిరి బహువేదఘోషములఁ జేసి నిరస్తసమస్తకిల్బిషో
త్కరు లగు [4]చున్నధన్యులు జగత్పరిపూజ్యులు బ్రహ్మసమ్మితుల్. 11

వ. ఇట్లు దమతోడన వనవాసంబు సేయ నిశ్చయించి వచ్చినవిప్రుల [5]నతిప్రీతి
గౌరవంబున నర్చించి తదాశీర్వాదంబుల నభినందితుం డై ధర్మతనయుండు
వారల కిట్లనియె. 12

క. అపహృతసర్వస్వుల మై, సపత్నులనికారమునఁ బ్రచండాటవిలో
విపులఫలశాకమూలము, లుపయోగించుచును [6]నిష్ఠ నుండెదుమాతోన్. 13

క. రానేల వచ్చి నవయం, గానేల నివాసములకుఁ గ్రమ్మఱి చనుఁడు
గ్రానేకపశార్దూలభ, యానకవనవాస మర్హ మగునే మీకున్. 14

వ. అనిన విని బ్రాహ్మణులు పరమదుఃఖితులై మీర కాని మాకు నొండుగతి లేదు
మమ్ము ననన్యశరణ్యుల విడుచుట [7]ధర్మంబు గాదు. 15

ఆ. ఆశ్రితులను భక్తు [8]లగువారి నన్యుల, నైన విడువఁజాల రట్టి విప్ర
వరుల భక్తిపరుల వసుధేశ మీయట్టి, ధార్మికులకు విడువఁ దగునె చెపుమ. 16

---

1 యేము కృతార్థు లగుదుము...సుజనులు. 2 మొప్పుదురే. 3 తమతోడ వనవాసంబు సేయ వచ్చువారల నిలిపి పాండవులు...యుండు నంతఁ. 4 మానధన్యులు. 5 నతిప్రియ 6 బ్రీతి. 7 ధర్మువు. 8 లైనవారిని నన్యు లైన; లగువారి నెప్పుడు, నన్యు లైనవిడువ రట్టి విప్ర, వరుల ధర్మపరుల వసుధేశ నీయట్టి, ధార్మికునకు; లగువారి నన్యుల, నైన విడువ రనిన యట్టి విప్ర, వరుల ధర్మపరుల.

వ. [1]అస్మత్పోషణోపాయచింత సేయ వలదు వన్యమూలఫలంబుల నేమ తెచ్చికొని
యుపయోగించుచు జపహోమాదిపుణ్యక్రియల మీకుం బ్రియంబు సేయుచు
నుండెద మధర్మవర్తియయి మీ కపకారంబు సేసిన ధార్తరాష్ట్రరాష్ట్రంబున
నుండ నోప మనిన వారలరాక కొడంబడి. 17

తే. ఇష్టమృష్టాన్నములఁ దొల్లి యెల్లప్రొద్దుఁ, దృప్తు లగుచున్న వసుమతీ దేవవరులఁ
గానలందు శాకాశనుల్ గాఁగ నెట్లు, సూడనోపుదు నని ధర్మసూనుఁ డపుడు.

శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మంబులు సెప్పుట.

వ. శోకమూర్ఛితుండై మహీతలంబుపయిం బడినయాతని నాశ్వాసించి శౌనకుం
డను బ్రహ్మఋషి దొల్లి యాత్మవ్యవస్థానార్థంబు జనకగీతంబు లయినశ్లోకంబుల
యర్థంబులు యుధిష్ఠిరున కిట్లనియె. 19

క. శోకభయస్థానంబు ల, నేకంబులు గలిగినను [2]విహీనవివేకుం
డాకులతఁ బొందునట్లు వి, వేకము గలవాఁడు బుద్ధివికలుం డగునే. 20

క. శారీరమానసమహా, దారుణదుఃఖములఁ జేసి [3]తఱఁగి శరీరుల్
క్రూరతరబాధఁ బొందుదు, రా రెంటిని జెఱుతు రార్యు లమలినబుద్ధిన్. 21

వ. వ్యాధిశ్రమానిష్టసంస్పర్శనేష్ట[4]వివర్జనంబు లనునాల్గింటం బుట్టి శారీరదుఃఖం
బు లాశుక్రియాదిప్రతియోగంబుల నుపశమిల్లు మఱి స్నేహజంబు లయిన
మానసదుఃఖంబులు జలంబుల నగ్ని యుపశమిల్లునట్లు విమలజ్ఞానంబునం జేసి
యుపశమంబునం బొందు. 22

క. స్నేహార్ణవమగ్నుం డయి, దేహి మహాదుఃఖముల న ధృతిఁ బొందును దుః
ఖాహతుఁడు శోకతాపవి, మోహి[5]యగున్ స్నేహమూలములు రాగాదుల్. 23

వ. కావున బంధుమిత్రధనసంచయంబులవలని స్నేహంబు విడుచునది పద్మ
పత్రంబు [6]నీరం బొందనియట్లెఱుక గలవారి నెట్టియెడలను స్నేహంబు వొం
దదు స్నేహంబున రాగంబును రాగంబునం గామంబును గామంబునం గ్రోధం
బును గ్రోధంబునం దృష్ణయు వర్తిల్లు. 24

క. అది సర్వదోషముల [7]కా, స్పద మది దురితక్రియానుబంధంబులకున్
మొదలు నిరంతరదుఃఖ, ప్రద మని మదిఁ దలఁచి తృష్ణఁ బాతురు సుమతుల్. 25

వ. మఱియుఁ [8]దృష్ణాతురుం డర్థలోభంబునఁ గోటరస్థం బయినయనలంబునం జేసిద
గ్ధంబగు వృక్షంబునుంబోలె వినాశంబునం బొందు నర్థాసక్తుం డైనవాఁడు

1 అస్మత్పోషణోపాయంబునకు జింత సేయ వలవదు... మధర్మవర్తులయి ... రాష్ట్రుల రాష్ట్రంబు. 2 వివేకవిహీనుం... బుద్ధి విరహితుఁ డగునే; బుద్ధి విరతుం డగునే; బుద్ధి విగతుం డగునే. 3 తగిలి. 4 విలోలజ్ఞానంబు లనునాలుగింటం బుట్టి. 5 యగుటఁ జేసి స్నేహముల రాగాదుల్; యగుటఁజేసి స్నేహమున మోహితుఁడై. 6 నీరిలోఁ బొరయనియ; నీరం బొరయనియ; నీరియం దుండియు బొందనియ. 7 కా, స్పదమయి... మది నెఱఁగి. 8 దృష్ణాపరుండై నర్థ.

శుభంబులు వడయ నోపండు మృత్యువువలనం బ్రాణులకు భయంబు గలుగున
ట్లర్థవంతులకు రాజ చోర స్వజన జలానలంబులవలన భయంబు నియతంబు. 26

తే. జలములందు మత్స్యంబులు చదలఁ బక్షు, లామిషం బెట్లు భక్షించు నట్లు దివిరి
యెల్లవారును జేరి యనేకవిధుల, ననుదినంబును భక్షింతు రర్థవంతు. 27

క. అర్థమ యనర్థమూలం, బర్థమ మాయావిమోహ నావహము నరుం
డర్థార్జనదుఃఖమున న, పార్థీకృత[1]కర్ముఁ డగుట పరమార్థ మిలన్. 28

వ. అట్టియర్థంబువలన దర్పకార్పణ్య మాన భయోద్వేగంబులు పుట్టుఁగావున [2]నర్థో
పార్జనచింత సేయవలదు రూపయౌవన ధన విభవ ప్రియసంవాసంబు లనిత్యంబు
లగుట నందు బుద్ధిమంతులు విమోహింప రనిన నమ్మునివరునకు ధర్మతనయుం
డి ట్లనియె. 29

సీ. ఆత్మోపభోగార్థ మర్థలాభేచ్ఛ నా, కెన్నండు లేదు మహీసురాగ్ర
గణ్యుల నత్యుగ్ర కాననాంతరమున, నెవ్విధంబున భరి యింతు నొక్కొ
యని యిప్డు వగచెద ననవద్యగుణయుక్తి, ననఘ మా యట్టిగృహస్థతతికిఁ
బోష్యుల [3]నెయ్యెడఁ బ్రోవక యుండను, విప్రుల నతిథుల వృథయ పుచ్చఁ

ఆ. జనునె నిజధనంబు సంవిభాగించి యీ, వలయు సాధురక్ష వలయుఁ జేయ
నభిమతాశ్రమంబు లందు గృహస్థాశ్ర, మంబ కాదె యుత్తమంబు వినఁగ. 30

వ. [4]మఱి యార్తునకు శయనంబును భీతున కభయంబును దృషితునకు జలంబును
బుభుక్షితునకు నన్నంబును శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనం బైన
యుత్తమగృహస్థధర్మంబు తృణ భూమ్యుదక ప్రియవచ నాదరదానం బెల్లవారికి
నశ్రమంబ యాత్మార్థంబుగా నన్నపాకంబును నసాక్షికభోజనంబును వృథాపశు
ఘాతంబును బాపహేతువు లగ్నిహోత్రంబులు ననడ్వాహంబులు నతిథి బాంధవ
విద్వజ్జన గురు మిత్త్ర భామినీ నివహంబు లపూజితంబులై యెగ్గు సేయును గావున
గృహస్థుండు సర్వసంతర్పకుండు గావలయుం గావునం బ్రతిదినంబును బక్షి
శునకశ్వాపదార్థంబు సాయంప్రాతలయందు వైశ్వదేవంబు సేసి యమృతాశి
యు విఘసాశియుఁ గావలయు యజ్ఞశేషం బమృతంబు నాఁబరఁగు నతిథిభుక్త
శేషంబు విఘసంబు నాఁబడు నట్టివృత్తి వర్తిల్లువాఁ డుత్తమగృహస్థుం డనిన
ధర్మరాజునకు శౌనకుం డి ట్లనియె. 31

క. హారివిషయాభిలాషము, గారణముగ నెంతయెఱుక గలవారును దు
ర్వారవికారముఁ బొందెదు,వారు నిజేంద్రియము లవి యవశ్యము లగుటన్. 32

---

1 జన్మఁ; విభవుఁ. 2 నర్థపరిత్యాగ చింతసేయవలయు రూపయౌవనవిభవేంద్రియ సంతోషంబు లనిత్యంబు లగుట నెందు; నర్థపరిత్యాగంబు సేయవలయు. 3 నేడ్తెఱఁ. 4 మఱియుఁ దృషితునకు జలంబును బుభుక్షితున కన్నంబును... శ్రాంతునకు శయనంబును... నట్టి యజ్ఞశేషం... బోష్యభుక్తశేషంబు.

వ. సంకల్పజం బైనకామంబునం దగిలినమనస్సుచేతం [1]ప్రేరితంబై శ్రోత్రాదీంద్రి
యంబులు శబ్దాదివిషయంబులం బరిభ్రమించుటం జేసి విషయాభిలాషవిశిఖవిద్ధు
లై దేహులు తేజోలుబ్ధంబు లైనశలభంబులుంబోలె శోకానలంబునం బడి త
మ్మెఱుంగక యవిద్యాకర్మతృష్ణలం జేసి సంసారచక్రంబునందుఁ బ్రవర్తిల్లుదు రట్టి
బ్రహ్మాదితృణపర్యంతభూతప్రవృత్తియందు రాగద్వేషవిముక్తులై యభిమాన
మత్సరంబులు విడిచి వేదచోదితం బైనసమ్యక్సంకల్పసంబంధం బింద్రియనిగ్ర
హంబు వ్రతవిశేషంబు గురుసేవనం బాహారయోగం బధ్యయనాగమంబు కర్మ
సన్న్యాసంబు చిత్తనిరోధం బను నెనిమిదింటను గర్మానుష్ఠానంబు సేసినమహాత్ములు
దమ తమ తపోమహత్త్వంబునం జేసి సంసారంబు జయింతురు నీవును శుశ్రూషా
శ్రవణగ్రహణ ధారణోహాపోహార్థవిజ్ఞాన తత్త్వజ్ఞానసమన్వితుండవు నీచేతం
బ్రారబ్ధంబు లైనయవి సర్వంబులును సంపన్నంబు లగు. 33

క. వసురుద్రాదిత్యాదులు, వసుధేశ [2]తపంబుగౌరవంబున నైశ్వ
ర్యసమృద్ధు లైరి తపమునఁ, బ్రసిద్ధముగ నిష్టసిద్ధి వడయుము నీవున్. 34

వ. తపస్సిద్ధు లైనవారు దమ తలంచినదాని నక్రమంబునం బడయుదురు గావున నీవు
నుపశమవంతుండ వై తపంబు సేసి [3]యోగార్థసిద్ధి వడసి బ్రాహ్మణుల ననుచ
రించుచు నీమనోరథంబు సఫలంబు సేయు మనిన శౌనకువచనంబు సేకొని భ్రాతృ
మధ్యగతుం డైనధర్మతనయుండు ధౌమ్యునకు నమస్కరించి యిట్లనియె. 35

తే. వనమునకువచ్చినవయంగ [4]వలవదుడుగుఁ, డనిన నుడుగక మీతోన యరుగుదెంతు
మనిరి బ్రాహ్మణుల్ వీరి కాహారమేయు, పాయమున నుగ్రవనమునఁ బడయనేర్తు.

వ. వీరల విడువ నోప నేమి సేయుదు ననిన వివిని ధౌమ్యుండు పెద్దయుం బ్రొద్దు [5]చింతించి
ధర్మరాజున కిట్లనియె. 37

ఆ. భూతరాశి దొల్లి పుట్టి బుభుక్షాభి, తప్తమయినఁ జూచి తద్భయంబు
నపనయింపఁ [6]గడఁగి యదితిసుతాగ్రణి, గమలబాంధవుండు గరుణతోడ. 38

వ. ఉత్తరాయణగతుం డై యుర్వీరసంబు పరిగ్రహించి దక్షిణాయనగతిం బర్జన్య
భూతుం డై యోషధులం బడసి రాత్రులయందుఁ జంద్రకిరణామృతంబునం జేసి
వానిం దడుపుచు [7]వర్ధించి యం దన్నంబు పుట్టించి ప్రజారక్షణంబు సేయుటం
జేసి యన్నం బాదిత్యమయం బని యెఱింగి తొల్లి భీమ వైన్య కార్తవీర్యనహు
షాదులు యోగసమాధిష్ఠితు లై సూర్యభజనంబున నన్నంబుఁ బడసి యాపదల
వలనం బ్రజల సముద్ధరించిరి గావున. 39

---

1 భ్రాంతంబు లయి... తేజోలుబ్ధభస్మీభూతశలభం... ధారణరుచివిజ్ఞాన ... సంబంధతుం
డవు...ప్రారంభితం బైన యవి. 2 తపోబలంబు వలనన నైశ్వ. 3 ఆత్మార్థసిద్ధులు వడసి బ్రాహ్మ
ణుల భరియించి వారలకు మనోరథంబు... 4 వలవదుండుఁ, డనిన నుడుగము మాతోన...బడయవ
చ్చు. 5 విచారించి. 6 గడఁగి. 7 వర్తించి...ప్రజాప్రాణధారణంబు...భీమసేనకార్తవీర్య.

లయగ్రాహి.
వారిరుహమిత్త్రు నమరోరగ మునిద్యుచరచారణగణప్రణుతచారుగుణు[1]లోకా
ధారు నఖిలశ్రుతిశరీరు హరిశంకర సరోరుహభవప్రతిము దారుణతమిస్రా
వారణమరీచిపరిపూరితదిగంతరు నిభూరికరుణానిరతు సూరుఁ ద్రిజగద్ర
క్షారతుసహస్రకరుఁ గోరిభజియింపుముమనోరథఫలంబులగుభూరమణనీకున్.

వ. అని ధౌమ్యుండువిశుద్ధాత్ముండైనధర్మరాజునకుసూర్యుండర్యముండు భగుండను నివిమొదలుగాఁగలనామంబులయష్టోత్తరశతంబునభీష్టసిద్ధిప్రదంబయినదానివిస్పష్టార్థవర్ణోచ్చారణంబును విధియుక్తంబును గా నుపదేశించి దీనిం దొల్లియింద్రువలన నారదుండు వడసె[2]నారదువలన వసు వనురాజు వడసె నాతనివలన నేను బడసితి నేను నీకిచ్చితినిది దేవనిర్మితంబుదీన నాదిత్యునతిభక్తి నారాధింపుమనిన.

ధర్మరాజు సూర్యు నారాధించి వరంబు గొనుట.

సీ. హితుఁడైనతనపురో[3]హితునుపదేశంబు, పేర్మితోఁ జేకొని ధర్మసుతుఁడు
నెమ్మిఁ బుష్పోపహారమ్ముల నాదిత్యుఁ, బూజించి భాగీరథీజలంబు
లందుండి విషయంబులం దింద్రియంబుల, నమలవ్రతానుభావమున నుడిచి
వాయుభోజనుఁడుఁబ్రాణాయామపరుఁడునై, సూర్యునామంబులసూర్యుఁ గొలిచి
ఆ. జపము సేయుచున్నఁదపనుఁ డాతనికిఁ బ్ర, త్యక్షమయి త్రిలోకచక్షుఁ డమర
వరుఁడు దురితహరుఁడుతరణి త్రయీమూర్తి, వనజమిత్త్రుఁ డిట్టులనియెఁగరుణ.

వ. నీతపమునకు మెచ్చితి నీపంద్రెండేండ్లును వన్యఫలమూలశాకంబులు నీమహానసంబున ద్రుపదరాజపుత్త్రిచేత సాధితంబులై యక్షయంబులైనచతుర్విధాహారంబులగునని యొక్కతామ్రస్థాలియిచ్చివరంబిచ్చి వనజహితుండంతర్హితుండైన.

చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు [4]పేర్మితోఁ
బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నుద్ధరించె న
ప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండినశాకమూలముల్
గడురుచి నిష్టభోజనసుఖంబులఁ దృప్తుల జేయుచుండఁగన్. 44

వ. ఇట్లనేకసహస్రమహీసురవరుల ననుదినంబును నభిమతభోజనంబులం దనిపి విఘసామృతభోజనంబులం దృప్తులైన[5]పోష్యుల భుక్తశేషంబు ద్రుపదపుత్త్రిక యుపయోగించుచుండం గొన్నిదినంబు లందయుండి పాండవులు బ్రాహ్మణులచేతం గృతస్వస్త్యయనులై బ్రహ్మర్షిసంఘంబులతోఁ గామ్యకవనంబున కరిగిరంత నిట ధృతరాష్ట్రుండు విదురుం బిలిపించి నీవు భార్గవుకంటె బుద్ధిమంతుఁడవు

---

1 భూతా, ధారు...తమిస్రాదారణ ; తమిస్రావారణు ; తమిస్రాదారణు...నఘారి నతికారుణికు...భూరిభుజనీకున్. 2 నారదువలన నేను వడసితి. 3 హితువచనంబులు...అర్థిఁ బుష్పోపహారమ్ముల...ననవరతావధానమున నుడిచి; ననవరతానుభావమున నొడిచి...సూర్యాదినామముల్ సూర్యుగుతిచి. 4 నెమ్మితోఁ...జెల్వుగ నిర్వహించె. 5 తనపతుల భుక.

పాండవకౌరవులకు సమ్మతుండవు చెప్పు మింక నప్పాండవు లేమి సేయువా రనిన విదురుం డిట్లనియె. 45

మత్తకోకిలము. దేవమూర్తులు పాండుపుత్త్రులు ధీరచిత్తులు వారిపెం
పీ వెఱుంగనివాఁడవే ధరణీశ వాయుసుతుండు గాం
డీవియుం భుజవిక్రమ ప్రకటేకృతుల్ వివిధాస్త్రవి
ద్యావిశేషులు వైరివీరులఁ దక్క నిత్తురె పోరులన్. 46

క. మొనసి యధర్మద్యూతం, బున భేదము పుట్టుఁ బాండుపుత్త్రులకును నీ
తనయుల కని మును చెప్పిన, విన నొల్లక కొడుకుపలుకు వింటివి కడఁకన్. 47

వ. ఇఁక నయినను వారి రావించి తొల్లి నీచేతం బడయం బడినరాజ్యంబునందుఁ బ్రతిష్ఠించి క్షత్త్రియ ధర్మంబును నిలుపుము రాజ్యంబును ద్రివర్గంబును ధర్మమూలంబులు గావున నందవర్తిల్లు ధర్మువు విడిచి యధర్మవర్తియయి కర్ణ శకుని దుశ్శాసన శిక్షితుండైన దుర్యోధనుదుశ్చేష్టితంబుల కొడంబడ వలవదు. 48

తే. వీనిపుట్టినపాపంపువేళఁ బెక్కు, దుర్నిమిత్తముల్ పుట్టిన నిర్ణయించి
యేను జెప్పితిఁ దొల్లియు [1] వీనిచేత, నెట్టుఁ గౌరవులకు నెగ్గు పుట్టు ననియు.

వ. కులదూషకు దూషించి కులంబు రక్షించుట ధర్మువు ధర్మరాజు నఖిలమహీరాజ్యరక్షకుం జేసి పుత్త్రపౌత్త్రమిత్త్రామాత్యబంధువర్గంబుల నెల్ల రక్షింపుము సభామధ్యంబునందు ద్రౌపదీభీమసేనులం బ్రార్థింప దుశ్శాసనుం బంపుము. 50

చ. [2]అతిశయితామరోత్తముఁ డహర్పతి తేజుఁ డజాతశత్త్రుఁ డూ
ర్జితుఁ డజితుండు నీసుతులు సేసినయెగ్గు దలంపఁ డాతనిం
ధృతి నభిషిక్తుఁ జేయుము ప్రతీపకులోద్వహ యిట్లయైన నీ
కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితం బగున్. 51

వ. అని పలికినవిదురుపలుకులు విని కడు నలిగి ధృతరాష్ట్రుం డిట్లనియె. 52

క. నాదేహంబునఁ బుట్టిన, యాదినుతుం విడువ నెట్లు లగు నాత్మజులం
[3]గా దనక విఘాతించు ద, యాదూరులు గలరె యిట్లు లన నీ కగునే. 53

—⟹ విదురుఁడు ధృతరాష్ట్రుని విడిచి పాండవులయొద్దకుఁ బోవుట. ⟸—

వ. నీవునాకొడుకులయున్నతి కెన్నండుసహింపవు నీసహాయత్వంబు నే నొల్లఁ బాండవులకడ కేనియు నొండుగడ కేనియు[4]నీ కిష్టంబైనచోటికి నరుగు మనిననాక్షణంబ విదురుండు మనోజవైకరథారూఢుండై పాండవులకడకుం గామ్యకవనంబున కరిగె నంత నతనిరాక దవ్వులం గని ధర్మరాజు భీమసేనున కిట్లనియె. 54

సీ. గాండీవమాదిగాఁ గలయాయుధావలు, లుక్కివంబున నప్పు [5]డొడిచికొనఁగ
మఱచినవాఁ డయ్యె మందాత్ముఁ డాధార్త, రాష్ట్రుండు గాంధారరాజతనయు

1 వీనిచెయి, నెట్టు. 2 అతిశయతాపసోత్తముఁ...ప్రతీపకులోత్తమ యట్లులైన నీ, కతమునఁ ...మకల్మషకీర్తిఁ. 3 గా దని విఘాతినిచ్చు. 4 నీ కిష్టం బగు నెడ కరుగుమనిన. 5 డొలిచికొనఁగ.

వచనముల్ విని యక్షవతి నెపంబున వానిఁ, గష్టుఁడై కొనపము కట్టి మనల
మగుడింపఁగా దుష్టమతిఁ జేసి విదురుఁ బు, త్తెంచెఁ గా కున్న నే తేర డితఁడు

ఆ. నింక జూద మాడ నేనోప నిది పని, గాఁగ [1]వచ్చు నొక్కొ కడఁగి విదురుఁ
డేమి సేయువార మితనిని యోగంబు, మనకుఁ జేయ కునికి మానుషంబె. 55

వ. అని తమలోఁ బలుకు చున్నసమయంబున విదురుం డేతెంచిన నతనికిఁ బ్రత్యు
ద్గతులై వినయప్రియసత్కారంబుల సంతుష్టుం జేసి తదాగమననిమిత్తం బడిగి
నవారికి విదురుం డి ట్లనియె. 56

క. మతి వారికి మాకును గడు, హితుఁడవు చెపు మయ్య యింక నెయ్యది కార్య
స్థితి యని ధృతరాష్ట్రుం డే, కత మిష్టం బైనకార్యగతి న న్నడుగన్. 57

వ. ఏ నుభయపక్షంబులవారికి జగంబునకు లగ్గుగ హితం బైనవిధంబు సెప్పిననది
సర్వజనరుచికరం బైనయాహారంబు రోగాతురునకు [2]నరుచికం బైన యట్లు యత
నికి రుచియింప దయ్యె. 58

ఆ. కార్యగతుల తెఱఁగు కలరూపు సెప్పిన నధికమతులు దాని [3]నాదరింతు
రల్పకార్యబుద్ధు లగువారలకు నది, విరసకారణంబు విషమపోలె. 59

వ. దాననచేసి ధృతరాష్ట్రుండు న న్నొల్లక యెగ్గులు వలికి నీవు విపరీతచేతస్కుం
డ విందుండ వలవదు పాండవులకడకుం బొమ్మనిన వచ్చితి రూపలావణ్యవతి
యై వృద్ధ శ్రోత్రియునిచేతం బరిణీత యైనతరుణియుం బోలె రాజ్యలక్ష్మి యద్దు
రాత్మునందు విరక్తయ కాని ప్రీతిఁ బుట్టింపదు. 60

ఆ. ధర్మరహితు లైనధార్తరాష్ట్రులకు భూ, రాజ్యలక్ష్మి సుస్థిరంబు గాదు
ధర్మతనయ నిన్నుఁ దద్రాజ్యసంపదల్, వలచి [4]తమకుఁ దామ వచ్చి పొందు.

వ. నావచనంబున నెగడునది యనిన ధర్మరాజు నట్ల చేయుదు నని యున్నంత
నిట ధృతరాష్ట్రుండు పాండవులయొద్ద విదురునునికి యెఱింగి ధృతిహీనుండై
తన హృదయంబును దృష్టియుం బోనివిదురుం బాసి నిమిషం బేని నిర్వ
హింప [5]నోపక సంజయున కిట్లనియె. 62

క. నెమ్మిగలవాని నాచి, త్త మ్మెఱిఁగెడువాని [6]విదురు ధర్మప్రియు నా
తమ్ము నిట వేగ తోడ్కొని, రమ్మరుగుము కామ్యకాఖ్య రమ్యాటవికిన్. 63

వ. అని పంచిన నప్పుడ సంజయుం డతిత్వరితగతిం గామ్యకవనంబున కరిగి. 64

మ. ధరణీదేవ [7]సహస్రసంకులముతో ధౌమ్యుండు ధర్మజ్ఞమా
భరణుల్ నల్వురు దమ్ములున్ విదురుఁడుం బాంచాలియుం బ్రీతిబం
ధురులై కొల్చుచు నుండ నున్న బుధమిత్రున్ ధర్మరాజుం బ్రభా

---

1 వచ్చునొండె. 2 నరోచికం బైన యట్లతనికి సొగయింప దయ్యె. 3 నాచరింతు, రల్పకార్యయుక్తు లగు. 4 తమకుఁ దార. 5 నేరక. 6 సకల ధర్మప్రియు నా, తమ్ముని నీవిటఁ దోడ్కొని. 7 విశిష్టసంకులముతో...ధర్మక్రియా...కొల్వఁగ నొప్పుచున్న బుధమిత్రున్ (బంధున్)...బ్రభా.

[1]స్ఫుర తేజుం బ్రభుఁ గాంచి సంజయుఁడు సంజాతప్రమోదాత్ముఁడై. 65

క. వనవాస[2]ము సేసియుఁ బ్రభు, వనరాజ్యము సేయునట్టివడువున సంతో
షనిబద్ధబుద్ధి యగుయమ, తనూజునకు భక్తి నెఱిఁగి తా నిట్లనియెన్. 66

వ. మిమ్మును ధర్మార్థవిదుం డైనవిదురునిం గౌరవేంద్రుం డెప్పుడుం దలంచు చుండు మీయనుమతంబునఁ దనయనుజుం దోడ్కొని తేర నన్నుఁ బుత్తెంచె ననిన విని ధర్మరాజు విదురున కిట్లనియె. 67

తే. [3]సర్వజనులును ధృతరాష్ట్రు శాసనంబు, సేయు చున్నచో మనకు విశేషభక్తిఁ
జేయవలయుఁ గావున నెడసేయ కరుగు, మనిన విదురుండు గజపురి కరిగెనంత.

వ. ధృతరాష్ట్రుండును వినయవినమితోత్తమాంగుం డైనవిదురు నతిస్నేహంబునం గౌఁగిలించుకొని [4]మూర్ధాఘ్రాణంబు సేసి నీవు నిత్యక్షమానిరతుండవు నాబుద్ధి లేమికి క్షమియింపు మనిన విదురుం డిట్లనియె. 69

ఆ. నీవు నీసుతుండు నెఱిఁ దప్పి [5]పలికినఁ, బథ్య మయినపలుక పలుక వలయు
వీరు లయినపాండ వేయులతో నిగ్ర, హంబు సేయు టిది నయంబు గాదు. 70

వ. అనుచు నెప్పటియట్ల కార్యసహాయుం డై విదురుండు ధృతరాష్ట్రునొద్ద నున్న నయ్యిద్దఱసంగమంబునకు శంకించి దుర్యోధనుండు కర్ణ శకుని దుశ్శాసనులతో ని ట్లనియె. 71

క. పాండవహితుఁ డగు విదురుఁడు, వెండియుఁ జనుదెంచి కార్యవిధులందు సహా
యుం డయ్యె నతనితోడ హి,తుం డయిమంతనము సేయఁ దొడఁగెన్ విభుఁడున్.

వ. వీర లింకఁ బాండవుల నిందులకు రావించువార లయిన నగ్నివిషజలంబులు ప్రయోగించి వారల కపాయంబు సేయుద మనిన విని శకుని దుర్యోధనుం జూచి యిట్లేల బాలిశం బైనమతిఁ దలంచితివి విదురధృతరాష్ట్రులు విపరీతమతులై రావించినను నిత్యసత్యనిరతు లైన యప్పాండవులు దమచేసినసమయంబు సలుపక యేలవచ్చువా రగుదు రనిన శకుని దుర్యోధనులకుఁ గర్ణుం డిట్లనియె. 73

ఉ. ఇత్తఱిఁ బన్నిపోయి పయి నెత్తి రణం బొనరించి వారలన్
మిత్తికి నంపి ధాత్రి నిరమిత్రముఁ జేయుద మిట్టు లైనఁ ద
ద్వృత్తులు నీక దక్కుఁ గురువీర కడంగుము నావుడున్ మదో
న్మత్తుఁడు గౌరవుం డతనిమాటకు సంతస మంది చెచ్చెరన్. 74

వ. సమరసన్నద్ధుఁ డై సమస్తబలంబును సమకట్టి వెలువడినం దనదివ్యదృష్టినంతయు నెఱింగి కృష్ణద్వైపాయనుండు వచ్చి యిది [6]ధర్మంబుగా దుడుగు మని దుర్యోధనుని వారించి ధృతరాష్ట్రున కిట్లనియె. 75

క. పుడమియు రాజ్యముఁ గోల్పడి, యడవుల నేకతమ యున్నయప్పాండవులం

1 స్వరతేజున్. 2 మయ్యునిటఁ. 3 సకల... సేయుచోటను మనకు. 4 మూర్ధిఘ్రాణంబు. 5 యరిగినఁ. 6 ధర్మంబుగా దని దుర్యోధను.

గడఁగి [1]వధియింతు నని నీ, కొడుకరిగెడు నిట్లు తలఁపఁ గూడునె బుద్ధిన్. 76
క. [2]ధృతియుతులై సత్య వ్రతఁ, రతు లయి పదుమూఁడువత్సరంబులు ధర్మ
స్థితి సలిపి వారఁ గడఁగెద, రతులపరాక్రములు మీఁద నాహవమునకున్. 77
క. వనగతు లని వారలపైఁ, జని భంగముఁ బొంది రాఁగ సమకట్టెడు నీ
తనయుఁడు గావున నీ వా, తని వారింపు మది యనుచితం బని నెమ్మిన్. 78
క. విను మేనును నీవును శాం, తనవుఁడు విదురుండు నుండి తగునె యధర్మం
[3]బున నీయుపేక్ష నయం, బును బాండవవిగ్రహంబు పుట్టుట లగ్గే. 79
వ. అనిన విని ధృతరాష్ట్రుండు దుఃఖితుండై నాకును గాంధారికిని భీష్మ విదుర కృపద్రోణులకు ననిష్టంబైనదుష్టద్యూతంబు [4] ప్రవర్తించి దుర్బుద్ధియైన దుర్యోధనుం బుత్త్రస్నేహంబున విడువ నోప [5] ననిన ధృతరాష్ట్రునకుఁ గృష్ణద్వైపాయనుం డిట్లనియె. 80

ధృతరాష్ట్రునకు వ్యాసుఁ డింద్రసురభిసంవాదంబు సెప్పుట.

ఆ. ఎల్ల నెయ్యములకుఁ దల్లిదండ్రులయందు, సుతులవలనినెయ్య మతిశయంబు
ధనము లెంత గలిగినను సుతరహితుల, కెమ్మెయిని మనఃప్రియమ్ము లేదు. 81
వ. తొల్లి సకలగోమాతయయినసురభి [6]సురరాజుకడకుంబోయి కరుణంబుగా నేడ్చినదానిం జూచి సురపతి విస్మితుండై యిట్లేల రోదనాకులితలోచన వయియున్న దాన వెల్లవారికి లగ్గ కదా యనిన నింద్రునకు సురభి యిట్లనియె. 82
క. నీవజ్రము [7]రక్షింపఁగ, నావారికి దక్కఁ ద్రిభువనంబులఁ గల భూ
తావలి కెల్లను గుశలము, దేవేంద్ర జగత్త్రయప్రదీప మహాత్మా. 83
వ. దీనిం జిత్తగింపుము బలంబు గలబలీవర్దంబులతో బలహీనంబు లయినవానిం బూన్చిన నవి దుర్వహభారవహనమహాలాంగలాకర్షణంబులయం దసమర్థంబులైన నడిచియుం బొడిచియు [8]ములుకోలలం గుట్టియు దుర్బలబలీవర్దంబుల జనులు బాధింపంజూచి యేను దానికి దుఃఖించెద ననిన సురభికి సురపతి యిట్లనియె.
క. నీకు నపత్యశతంబు ల,నేకంబులు గలవు వాని కేకాకృతి దుః
ఖాకులత సంభవింపదు, శోకింపకు మనిన సురభి సురపతి కనియెన్. 85
వ. దేవా దీనాననంబు లయి దుర్బలంబు లయినయపత్యంబుల దుఃఖం బే నెట్లు సూడ నోపుదు ననిన నగి యింద్రుండు దానికిం గరుణించి వర్షంబునఁ దృణవర్ధనంబు సేసి దుర్బలబలీవర్దంబులకు బలంబు గావించె నని యింద్రసురభిసంవాదంబు వేదంబులయందు వినంబడుఁ గావున నీకుం బుత్త్రస్నేహంబు సామా

1 వధియింపఁగా నీ. 2 ధృతిఁ బాండుసుతులు సత్య, వ్రతులై; యురుసత్య, వ్రతులై. 3 బును పేక్షింపఁగ. 4 ప్రవర్తిల్లె. 5 నేమిసేయుదు ననిన. 6 సురపతియొద్దకుం బోయి కారుణ్యంబుగా. 7 పనిసేయఁగ...జీవావలికి సెల్లఁ గుశలము. 8 మునికోలలం బొడిచియు దిట్టియుం.

న్యంబుగా వైనను దీనులై వనంబున నవయు చున్న యప్పాండవులకు దయా ళుండ వగుము. 86

తే. నీవుఁ బాండుండు విదురుండు నెమ్మి నాకు
నొక్కరూ పైనయట్లు నీ కుదితయశులు
నీసుతులు నూర్వురును బాండునృపతనూజు
లేవురును నొక్కరూప కా నెఱుఁగవలయు. 87

క. సుజనులసహవాసంబునఁ, గుజనులు సద్ధర్మమతు లగుట నిక్కము ధ
ర్మజునొద్దనుండి నీయా, త్మజుఁడు ప్రశాంతుండు ధర్మమార్గుండు నగున్. 88

వ. రాజర్షి యైనధర్మరాజుతోడిసహవాసంబు సర్వజనహితంబు గావున నాతని నుపా సించి దుర్యోధనుండు గొండొకకాలం బుండునట్లుగాఁ బనుపు మట్లయిన నుభ యపక్షంబులకు ల గ్గగు ననిన ధృతరాష్ట్రుండు గృతాంజలి యయి మునీంద్రా దుర్యోధనుండు నాపలుకులు వినండు కురుకులంబు రక్షించునట్టిబుద్ధి గల దేని దాని మీర శిక్షింపుం డని మ్రొక్కిన. 89

క. అనఘుఁడు మైత్రేయుం డను, మునినాథుఁడు వచ్చి ధర్మమున నాతనిఁ దా
ననుశాసించుఁ దిరంబుగ, నని చెప్పుచు నప్పరాశరాత్మజుఁ డరిగెన్. 90

వ. అంత. 91

ఉ. న్యాయవిదుండు గామ్యకవనంబున ధర్మజునొద్దనుండి మై
త్రేయుఁడు ధీయుతుం డరుగుదెంచిన నప్పుడ యమ్మునీంద్రు నిం
ద్రాయితుఁ డాంబికేయుఁ డుచితస్థితిఁ బూజితుఁ జేసె నాత్మ ని
శ్శ్రేయసలాలసుం డయి విశేషసపర్యలఁజేసి భక్తితోన్. 92

వ. ఇట్లు దనచేతం బూజితుండై సుఖవిశ్రాంతుం డైనమునివరునకు ధృతరాష్ట్రుండు ముకుళితహస్తుం డై భట్టారకా యెందుండి వచ్చితి రని యడిగిన నతనికి మైత్రే యుం డి ట్లనియె. 93

చ. అలఘు[1]తపోభరంబున జటాజినముల్ ధరియించి రూక్షవ
ల్కలములు గట్టి కూరలును గాయలుఁ బండులు భోజనంబుగా
నలయక కామ్యకం బనుమహావిపినంబున నున్నపాండవే
యులకడనుండి వచ్చితిఁ గురూత్తమ నీసుతు నిన్ను జూడఁగన్. 94

వ. ఏ నఖిలతీర్థదర్శనార్థంబు పరిభ్రమించుచుఁ గురుజాంగలంబున కరిగి యందుఁ గురుకులోత్తము లైనపాండుపుత్త్రులం జూచితి. 95

ఆ. అనినవనతాస్యుఁ డయి ధృతరాష్ట్రుఁ డిట్లనియె నెట్లు సెప్పుఁ [2]డయ్య యందుఁ బాండవులకు సత్యభాషణులకుఁ గుశలంబె వార లిట దలంతురొక్కొ. 96

క. అమితభుజశక్తి నంతక, సము లప్పాండుసుతు లిందుసాభ్రాత్రస్నే

1 తపోబలంబున. 2 డయ్య మీరుఁ.

హామునకు విచ్ఛేదముగా, సమయాతిక్రమము సేయ [1] సమకట్టరుగా. 97
వ. అనిన మైత్రేయుం డి ట్లనియె. 98
క. చనుదెంచి మహామునివరు, లనవరతము వారలకుఁ బ్రియం బొసరఁగ దీ
వన లీగిఁజేసి కుశలము, మనుజేశ్వర వారు ధర్మమతియుతు లగుటన్. 99
క. వారలు సమయము దప్పిన, వారిజరిపుహితులగుతు లవశ్యముఁ దప్పక్
వారికి నకారణంబ ని,కారము నీకొడుకు సేఁసె గడునహితుం డై. 100
వ. అని దుర్యోధనుం జూచి యయ్యా నీవు బుద్ధిగలవేనిఁ బాండవులతో విరోధం
బుడుగు మట్లయిన నీకును వారికిం గురుకులంబునకు లగ్గగు నాపలుకుఁ జేకొనుము.
సీ. వజ్రసంహనను లవార్యపరాక్రముల్, పాండుకుమారు లాఖండలాభు
లందఱు నాగశతాయుత [2] ప్రాణు లు, గ్రాహవకాంక్షు లుత్సాహపరులు
వారలలో బలవంతుండు బకహిడిం, బాసురు లనువారి నాసురమునఁ
జంపె నాగాయుతసత్త్వ జరాసంధు, నెక్కటి యోర్చినయక్కజుండు
తే. ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁ డనుసు, రారినిశ్చల ఘనభీకరాంగుఁ బట్టి
పోర వధియించి నట్టిసమీరజునకు, భూరిభుజునకు మార్కొనువారుఁ గలరె.

మైత్రేయుఁడు దుర్యోధనుని శపియించుట.

వ. వారికి వాసుదేవ ధృష్టద్యుమ్నులు సంబంధ [3] సహాయులు జరామరణవంతులైన
మనుజులు వారిం జెనకి యెట్లు జీవింతురు నీవు వారితో నొడంబడియుండు మిది
కార్యం బనిన మైత్రేయుపలుకు లాదరింపక పాదాంగుష్ఠంబున నేల వ్రాయుచు
బాహువెత్తి దొడలు సఱచి నగుచున్న యాదుర్యోధనుం జూచి మైత్రేయుండలిగి
యీయపరాధంబున నాహవంబగునందు భీముగదాఘాతంబున నీయూరుయుగ
ళంబు భగ్నం బయ్యెడు మని శాపంబిచ్చిన వెఱచి ధృతరాష్ట్రుండు మునీంద్రా
యట్లుగా కుండం బ్రసాదింపు మనిన నమ్మునివరుం డి ట్లనియె. 103
తే. కడఁగి సమబుద్ధి వీనికిఁ గలిగెనేనిఁ, గాదు శాపఫలం బట్లు గాక బుద్ధి
హీనుఁడై గర్వితుం డగు నేని శాప, హవ్యవాహ ఫలంబు వీఁ డనుభవించు.
వ. అని ప్రసన్నుం డైన మైత్రేయునకు నాంబికేయుం డి ట్లనియె. 105
క. కిమ్మీరుం డనురక్కసుఁ, డమ్మారుతతనయుచేత నత్యుగ్ర [4] వనాం
తమ్మున నిహతుం డయినవి,ధ మ్మెట్టులు సెప్పు మద్భుతం బిది యనినన్. 106
వ. నాపలుకులు నీకొడుకు వినం డయ్యె నేనేల చెప్పెద దీనిం బాండవసహాయులైన
విప్రులచేత విదురుం డిమ్ముగా నెఱింగినవాఁ డతనివలన విను మని చెప్పి మైత్రే
యుం డరిగినం గిమ్మీరవధకథాశ్రవణ [5] పరుం డై త న్నడిగిన ధృతరాష్ట్రునకు

1 సమకట్టెదరో. 2 త్రాణు...లుత్సాహమతులు ... నాహవమునఁ... ఘోరరణమున... నిశ్చలభీకరాకారు; నిశ్చలభీకరాకారుగిట్టి. 3 కార్యసహాయులు...నాహవంబునాఁడు. 4 రణాంతమ్మున...బది. 5 కుతూహలపరుఁ డై.

విదురుం డిట్లనియె నిం దుండి చని పాండవులు మూఁ డహోరాత్రంబులు నిరంతరప్రయాణంబు సేసి కామ్యకవనంబుఁ జొచ్చువా రొక్కనాటియర్ధరాత్రంబున రాక్షసప్రచారవేళయందుఁ బరిభ్రమించుచు రాక్షసమాయ గావించు చున్నవాని నతినిశితదంష్ట్రికరాళం బైనతనవదనగహ్వరంబుఁ దెఱచి గ్రుడ్లు మెఱవ బభ్రుకేశంబులు దూల బాలార్కరశ్మియుతం బయినబలాహకంబునుం బోలె సకలప్రాణిభయజననంబుగా గర్జిల్లు చున్నవాని [1]నిజపాదఘట్టితమహీతలప్రచలనవేగవేల్లితవల్లీపల్లవబాహుపరిరంభణసుఖంబుఁ బాదపంబుల కాపాదించు చున్నవాని నెదుర నొక్కరక్కసుం గని రంత వాఁడును బ్రాహ్మణసంఘంబుముందటఁ గృష్ణాజినావృతు లై వచ్చుపాండవుల దవ్వులం గని మార్గనిరోధి యై మహాపర్వతంబునుంబోలె నున్న నదృష్టపూర్వప్రమాణం బైనవాని దేహంబు జూచి నిమీలితనయన యయి దుశ్శాసనకరాకృష్టవికీర్ణ వేణీభరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వతంబులనడిమినదియుంబోలెఁ బతుల నడుమ భయవ్యాకులచిత్త యైన నింద్రియంబులు విషయరతిం బరిగ్రహించునట్లు లేవురు నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించు చున్నంత.

క. రక్షోఘ్నమంత్రముల నా, రాక్షసమాయా[2]పరిస్ఫురణఁ జెఱిచెఁ గ్రియా
దక్షుఁడు ధౌమ్యుఁడు పాండవు, లీక్షించుచు నుండఁగా నహీనప్రతిభన్. 1(8

వ. అంత. . 109

క. ప్రతివిహితమాయు నత్యా, యతభుజయుతుఁ గోపఘూర్ణితారుణ[3]విస్ఫా
రితనేత్రు నసురఁ జూచి భ, రతకులవర్ధనుఁడు ధర్మరాజి ట్లనియెన్. 110

వ. నీ వెవ్వరివాఁడ వెవ్వండ వివ్వనంబున నేల యున్నవాఁడ వనిన వాఁ డి ట్లనియె.

క. ఏను బకాసురుననుజుఁడఁ, గినాశుఁడ మానవులకుఁ గిమ్మీరుఁ డనం
గా నెగడుదు నీకామ్యక, కాననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్. 112

క. పాయక యుండుదు రాక్షస, మాయల సమరంబు సేసి మనుజుల విగతో
పాయులఁ జంపుచు భక్షణ, సేయుదు నమరాదులకు నజేయుఁడఁ [4]బోరన్. 113

వ. నాకు వెఱచి యెల్లవారును దూరంబున దీనిం బరిహరింతురు మీ రెవ్వ రిందుల కేల వచ్చితిరి మిమ్ము వధియించి యిపుడ భక్షించెద ననిన వానికి యుధిష్ఠిరుం డి ట్లనియె. 114

ఆ. ఏను ధర్మసుతుఁడ నీతఁడు భీముండు, వాఁడు విజయుఁ డల్లవారు గవలు
పాండవేయుల మనుప్రథ వనవాసంబు, సేయ వచ్చితిమి విశేషయుక్తి. 115

సీ. అనవుడు రాక్షసుం డట్టహాసంబుతో, నెట్టెట్టు భీముండె యీతఁ డేమి
పుణ్యమో వీని నెప్పుడు సంపఁగాంతునో, యని యున్నచోఁ దాన యరుగు దెంచె

---

1 నిజపాదపాతఘట్టిత ; నిజపాదఘట్టనమహీతలప్రచురవేల్లితవల్లీ... వ్యాకులితచిత్త. 2 బలస్ఫురణ. 3 విస్ఫారితనేత్రు. 4 నెందుకా.

నధికు మాయన్న బకాసురు నాయిష్ట, సఖు హిడింబాసురుఁ జంపి యున్న
ఖలు మ్రింగి జీర్ణంబు గావింతు వాతాపిఁ, దడయక మ్రింగిన తపసియట్ల
ఆ. యనిన [1]రక్కసునకు నరిగినయగ్రజు, నలుక యెఱిఁగి వీరుఁ డర్జునుండు
మొనసి గాండివంబు మోపెట్టె నవశిత, ఖడ్గపాణు లైరి కవలు నంత. 116

కిమ్మీరుం డనురాక్షసుఁడు భీముచేఁ జచ్చుట.

ఉ. ఘోరపరాక్రముల్ ప్రబల కోపపరుల్ పృథుసారభూరిభూ
మీరుహపాణు లుద్ధతు లమిత్రవిఘాతులు వీరబృందబృం
దారకు లార్చు చొండొరులఁ దాఁకిరి దారుణభంగిఁ బొంగి కి
మ్మీరసమీరసూనులు సమీరవిధూతపయోధు లట్లనై. 117
తరలము. పొరిని వారలచేతియున్నత [2]భూరుహాయుధముల్ పర
స్పరకఠోరశిరస్థ్సలంబుల పై వడిం బడి మత్తకుం
జరశిరఃపతితంబు లైనలసన్మృణాళములట్ల జ
ర్జరిత మయ్యెఁ దదారవప్రతిశబ్ద మొప్ప నగంబులన్. 118
వ. ఇట్లొక్కముహూర్తంబు వృక్షయుద్ధంబు సేసి యాసన్నమహీరుహంబులు స
మసిన నయ్యిద్దఱు శిలాయుద్ధంబునకుఁ దొడంగి చేయునెడం బవనజనిక్షిప్త
నిష్ఠుర శిలాహతహృదయుం డై భానుం బట్టుకొనుస్వర్భానుండునుంబోలెఁ
గిమ్మీరుండు భీముం బట్టుకొనిన భీముండు వాని హీనబలుం గా నెఱింగి
కృతాంతదండానుకారంబు లయినతన బాహుదండంబుల నమ్మనుజకంటకుకటి
కంఠప్రదేశంబులు పట్టుకొని నేలం బెట్టి దేహయష్టి విఱిచి బకుం జంపినవిధం
బునఁ గిమ్మీరు విగతప్రాణుం జేసి. 119
తే. బకహిడింబులు హతు లైనఁ బనివిపనివి,యఱచి [3]శోకింపఁగానకయమపురమున
కరిగి తక్కట రాక్షస యనుచుఁ దెరువు,వాయఁ బావని దత్కళేబరము వైచె.
వ. ఇట్లు ధర్మరాజువచనంబునఁ గిమ్మీరు నక్రమంబున వధియించి తద్వనవాసు
లకు రాక్షసభయం బుడిపినమహావీరు నమ్మారుతాత్మజు ధర్మార్జుననకులసహ
దేవులును ధౌమ్యాదిమహీసురవరులును బ్రశంసించి రని విదురుండు [4]గిమ్మీరు
వధ సెప్పిన విని ధృతరాష్ట్రునకు హృదయదలనం బయ్యె నిట పాండవులు
గామ్యకవనంబున నుండునంత. 121

యాదవపాంచాలాదులు పాండవులకడ కేతెంచుట.

సీ. వసుమతీరాజ్యంబువలన నిరస్తులై, మునివృత్తి నత్యుగ్రవనములోన
నవయుచుఁ బాండుభూనాథనందను లున్న, వా రని విని యతిక్రూరమతుల

1 నగ్రజునకు నలిగినరక్కసు. 2 భూరిభూరుహముల్...నభంబునకా. 3 శోకించి.
4 గిమ్మీరవధ...నఁట.

ధృతరాష్ట్రసుతుల నిందించుచుఁ బాంచాల, యాదవ వృష్ణిభోజాంధకు లెల్ల
నచ్యుతప్రముఖు లై యప్పాండవులకడ, కేతెంచి శోకపరీతు లగుచు

ఆ. నున్న నధికధర్మయుక్తుఁ డుపేంద్రుండు, నికృతిఁజేసి పాపనియతబుద్ధిఁ
బాండవులకు నట్లపాయంబు సేసిన, ధార్తరాష్ట్రులకును దద్దయలిగి. 122

క. అనిఁ గర్ణశకుని దుర్యో, ధన దుశ్శాసన నవాస్ర ధారాపాతం
బునఁ దృప్తిఁబొందు వసుధాం, గన రాక్షస కాక గృధ్రగణములతోడన్.

క. అవినీతుల వధ్యులఁ గౌ, రవపాంసులఁ జంపి ధర్మరాజునకుఁ గురు
[1]ప్రవరున కొనరింతమ యీ, యవనీరాజ్యాభిషేక మవిజితశక్తిన్. 124

వ. అని యుగాంత్యకాలకుపితకృతాంతాకృతి నున్న జగన్నాథు జనార్దనుం బ్రశాం
తచిత్తుం జేసి యర్జునుం డతని నిట్లని కీర్తించె. 125

ఆ. పూజ్యుఁడవు పురాణపురుషుండ వీశుండ, వప్రమేయుఁడవు చరాచరంబు
లయినభూతరాసు లచ్యుత నీయంద, పుట్టు నిలుచు లయముఁ బొందు[2]చుండు.

వ. నీవు దొల్లి గంధమాదనంబునం గందమూలఫలాశనుండ వై పదివేలేండ్లుతపంబు
సేసి పుష్కరంబున నేకాదశసహస్రవర్షంబులు జలంబుల యాహారంబుగానుండి
ప్రభాసం బనుతీర్థంబున దివ్యసహస్రవర్షంబు లేకపాదస్థితుండ వయి యుండి బ
దరీవనంబునం [3]బవనంబుభక్షించుచు నూర్ధ్వబాహుండ వయి యేకపాదంబున
ననేక సహస్రవర్షంబులు నిలిచి సరస్వతీసత్త్రంబున నవకృష్ణోత్తరాసంగుండ వై ని
యమకృశీకృతశరీరంబుతోఁ బండ్రెండువర్షంబుల శేషవ్రతంబులుసలిపిన తపోని
ధానంబవు నిఖిలలోకజైత్రుండ వయి చైత్రరథంబున నుత్తమక్రతువు లనేకం
బులు సేసి యొక్కొక్కక్రతువునకు నూఱేసిలక్షలు సువర్ణంబులు దక్షిణ లి
చ్చిన యజ్ఞపురుషుండవు తపోయజ్ఞంబులు రెంటను సమృద్ధతేజుండ వయి దైత్య
దానవేంద్రుల వధియించి యింద్రున కింద్రత్వం బేకాధిష్ఠితంబు సేసిన లోకప్ర
భుండ వదితికిం గశ్యపునకు నుదయించి యింద్రానుజుండ వై త్రివిక్రమంబునం
ద్రిజగంబుల నభివ్యాపించిన విశ్వరూపధరుండవు. 127

క. నరకశిశుపాలు రాదిగ, ధరణీకంటకుల నధికతరదర్పులఁ బ
ల్వుర వధియింపఁగ మహి నవ, తరించినమహాత్ముఁడవు [4]నుతస్థిరశక్తిన్. 128

క. అనృతము మదమును మత్సర, మును గ్రోధము [5]ననువికారములు వొరయునె ని
న్ననుపమగుణముల నీ కొరు, లెన వోల్పఁగఁ గలరె సురమునీంద్ర ప్రణుతా.

వ. అని కృతాంజలి యయిన ధనంజయుం జూచి దనుజభంజనుం డిట్లనియె. 130

తే. నరుఁడు నారాయణుండు నాఁబరగుఁనాది,మునుల మిద్దఱమందునీవనఘ నరుఁడ

---

1 ప్రవరున కొనరించెద నీ...మవహితశక్తిన్. 2 నెంచు. 3 దత్ఫలంబులు బవనంబు సరస్వతీసత్రంబున నపాకృతసంగుండవై కృష్ణాజినోత్తరీయా (స) ంగుండవై నియమకృశీకృతాంగుండవై పండ్రెండువేలవర్షంబు. 4 నుతస్థిరశక్తిన్. 5 నిర్వికార; దుర్వికార; నిర్విచార.

వేను నారాయణుండ ననూనశక్తి, యుతుల మైన మర్త్యయోనిఁ బుట్టితిమి [1]పేర్మి.

తరువోజ. నిరతంబుగా నేను నీ వనుభేదనియమంబు లే దైక్యనిష్ఠయ మనకు
నిరువురకును నీకు నిష్టుండ నాకు నిష్టుండు మఱి నీ కనిష్టుండ నాకుఁ
గర మనిష్టుం డట్లుగా నమ్ము మనుచు ఘనభుజుల్ భువనోపకారైకమతులు
హరియు నర్జునుఁడుఁ బ్రియంబుతోఁ దగిలి యన్యోన్యహితభాషు లగుచుండు నంత.

### ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దనపరిభవంబు సెప్పి దుఃఖించుట.

వ. అఖిలరాజలోక పరివృతుం డయి యున్ననారాయణునొద్దకు వచ్చి ద్రుపదరాజపుత్త్రి ముకుళితకరాంబుజ యయి నిన్ను నాదిప్రజాసర్గంబునఁ బ్రజాపతివని యసితుం డయిన దేవలుండును సత్యంబువలన యజ్ఞం బుద్ధరించుటం జేసి నిత్యసత్యమయుండ వయినయజ్ఞపురుషుండ వని కశ్యపుండును శిరంబున దివంబును బాదంబుల మేదినియును లోచనంబుల సూర్యుండును నవయవంబుల లోకంబులు నభివ్యాపించుటం జేసి సర్వమయుండ వని నారదుండును నక్షయజ్ఞాననిధి వని సర్వమునిముఖ్యులును జెప్పిరి. 133

మధ్యాక్కర. అని ననివృత్తులై పుణ్యచరితులై యాత్మప్రబోధ
వినిహితచిత్తులై సర్వధర్మార్థవిదు లయి తృప్తిఁ
దనరెడు రాజర్షివరులకును యోగధరులకు సాధు
జనులకు గతి నీవ నిత్యకారుణ్య సర్వశరణ్య. 134

వ. నీయంతఃకరణప్రవృత్తికగోచరం బెద్దియు లేదయినను నాపడినపరాభవం బెఱింగించెద. 135

సీ. పార్థివప్రభుఁ డైన పాండుమహీపతి, కోడల నయి యుద్ధకుశలు లయిన
[2]పాండుతనూజుల భార్యనై పూజ్యఁడ, నైన నీయనుజనై యధికశక్తిఁ
బరఁగుధృష్టద్యుమ్ను భగిని నై ధృతరాష్ట్రు, పట్టిచే సభఁ దల పట్టియీడ్వఁ
బడి పాపకర్ముచేఁ బరిధాన మొలువంగఁ, బడి దారుణం బైనపరిభవంబు
ఆ. పడితి నట్టినన్నుఁ బాండవుల్ సూచుచు, నుండి రోరులువోలె నుక్కుదక్కి
యాపగాతనూజుఁ డాదిగాఁ గలవృద్ధ, బంధుజనులు సూచి పలుక రయిరి. 136

క. శర ణనినవారిఁ గరుణా, కరు లయి రక్షించుపురుషకారాన్వితులే
శర ణని యఱచిన [3]నాలిం, పర భీమార్జునులబాహుబల మేమిటికిన్. 137

వ. భ్రాతృపుత్త్రబంధుజనంబులు నాకుం గలిగియు లేనివా రయి రట్టియెడం గర్ణుండు నన్నుం జూచి నగియె. 138

ఆ. కర్ణునగవు లోకగర్హితుం డగుదుస్స, సేను [4]చెయిదికంటె శిఖియపోలె

1 నెమ్మి. 2 పాండవవీర్యుల భార్యనై పూజ్యుండ, నైన నీ...నుండి రుక్కణంగి యొరుల పోలె, నాపగాతనూజుఁ. 3 వారిం, పర భీమార్జునుల. 4 చెయ్వు.

నడరి నామనంబు నతిచారు[1]ణక్రియ, నేర్చు చున్నయది మహీధరుండ. 139

వ. తొల్లి వేదాధ్యయనంబు సేయుచు బాలకేళీవినోదంబున నున్నకాలంబునఁ బ్రమాణకోటియందు సుప్తుం డయినభీమసేను నంటఁ గట్టి గంగమడువునం ద్రోపించియు విషంబుఁ బెట్టియు విషసర్పంబులం [2]గఱపించియు జననీసహితు లైనయేవురను వారణావతంబున లక్కయిల్లు సొనిపి యందు దహనంబు బ్రయోగింపం బంచియు ననేకంబు లైనయపకారంబులు సేసి యిప్పుడు దుర్యోధనుం డధర్మద్యూతంబున రాజ్యంబు నపహరించి రాజలోకసమక్షంబునం దమ్ము నిరాకృతులం జేసినను బరాక్రమపరాఙ్ముఖు లైనపాండవులు నాపరిభవంబు నెట్లు దలిగెద రని బాష్పధారాస్నపితపయోధర యయి పాణివల్లవంబుల నయనసమ్మార్జనంబు సేయు చున్నపాంచాలిం జూచి వాసుదేవుం డి ట్లనియె. 140

చ. [3]తనుకుచు నున్ననీహృదయతాపనిమిత్తమునన్ సురేంద్రనం
దనుపటుబాణపాతహతిఁ దద్ధృతరాష్ట్రబలంబు మృత్యుసా
దనమున కేఁగుఁ జుమ్మిదియ తథ్యము నావచనంబు దప్పది
వ్వననిధు లేడు నింకిన దివంబును రాత్రియు సంచలించినన్. 141

వ. అనిన నర్జునుండు ద్రౌపదిం జూచి యిట్లనియె. 142

ఉ. ఈపురుషోత్తముండు మన కిందఱకుం గుశలంబు సేయుచుం
బాపకలంక పంకములఁ [4]బాయఁగఁ జేయుటఁ జేసి దుర్మదో
ద్దీపిత శత్రుసంహతి హతిం బరమార్థమ పొందు నేల సం
తాపము నీకుఁ జేయఁగఁ ద్రిధామజయోన్నతి గల్గి యుండఁగన్. 143

వ. అనిన ధృష్టద్యుమ్నుం డి ట్లనియె. 144

క. [5]వినయవిహీనుల దుర్యో, ధనదుశ్శాసనులఁ బవన తనయుఁడు రాధా
తనయుని నరుఁ డేఁ గుంభజు, ననిఁ జంపుదు మేల వగవ నంబుజనేత్రీ. 145

వ. అని యందఱు ద్రుపదరాజపుత్త్రి నాశ్వాసించి రంత నచ్యుతుండు ధర్మరాజున కి ట్లనియె. 146

తే. ద్వారవతినుండి యే యుయు థానువలన, ధారుణీశ యింతయు వినితత్క్షణంబ
యరుగుదెంచియాపన్నుఁడ వైననిన్నుఁ, జూచి దుఃఖోపహత [6]మనస్కుండ నైతి.

---

1 ణాకృతి. 2 బట్టి గఱపించియు లాక్షాగృహంబున నుండఁ బనిచి యెవ్వ రెఱుంగకుండ ఘోరానలంబుఁ దరి కొలుపం బనిచియు నట్టి దుర్యోధనుం డిప్పు డధర్మద్యూతంబున. 3 తనరుచు...లేమఁ గ్రుంకిన. 4 బాపుచు నుండుటఁ జేసి; బాచుచు నుండుటఁ జేసి...శత్రులోకవితతిం బరిమార్తుము పొంద నేల సం, తాపము నీకు జేయఁగ ద్రిధామజయోన్నతిగల్గియుండఁగన్; శత్రుసంఘము హతిం బరమార్థముఁ బొంద నేల...నృథావిజయోన్నతి; విధాతృనియోగము. 5 వినయహీనులదుశ్శా, సనదుర్యోధనులఁ...దంబుజనేత్రీ; నంబుజవదనా. 6 చేతసుండ నైతి.

వ. అయ్యవసరంబున నేను మీయొద్ద నుండమింజేసి యిట్టిదుర్వ్యసనంబు సంభవి
ల్లెంగామజంబు లైనస్త్రీద్యూత మృగయా పానంబు లనునాలుగుదుర్వ్యసనం
బులం బ్రవర్తిల్ల కుండఁ బ్రతిషేధింపవలయు నందును విశేషంబుగా [1]ననర్థ
మూలం బయినద్యూతంబుఁ బరిహరింపనినాఁడు పాపం బగు నని హేతుదృష్టాం
తంబులు సూపి కృపద్రోణవిదురగాంగేయులం దోడుసేసికొని యాంబికేయు
నొడంబఱిచి దుష్టద్యూతంబు సర్వప్రకారంబుల వారింతు. 148

క. [2]వలచి హితంబునఁ బథ్యముఁ, బలికినఁ జేకొననిధర్మబాహ్యుల నవివే
కుల నిగ్రహింతు మీఁకె, గ్గులు మత్సాన్నిధ్యమున నగునె యెయ్యెడలన్. 149

—కృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకోపాఖ్యానంబు సెప్పుట.—

వ. ఏను సముద్రతీరంబునసాల్వుతోడం బదినెలలు యుద్ధంబుసేసి వాని వధియించు
పొంటె నక్కడ మసలితి నది గారణంబుగా మీకు దుర్వ్యసనావసరంబున నల
బ్ధసన్నిధానుండ నయితి ననిన నది యెట్లని యుధిష్ఠిరుం డడిగిన నాతనికి
సౌంభకోపాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుం డిట్లని చెప్పె నీయజ్ఞంబున
నర్ఘ్యనిమిత్తంబుననసహిష్ణుం డయినశిశుపాలుండు నాచేత నిహతుం డగుట
విని వానితమ్ముండుసాల్వుం డనువాఁడు తద్వధప్రవర్తితక్రోధుం డయి కామ
గమనం బయినతనసౌంభకం బనునగరంబుతో సన్నద్ధుం డయి వచ్చి ద్వార
వతీపురంబు నవరోధించి. 150

చ. ప్రతినరపాలకాలు శిశుపాలు బలాధికుఁ జంపి దర్పసం
హితుఁ డగు చున్న [3]వృష్ణిఖులుఁ డెక్కడ నెక్కడ నాతనిం జయో
న్నతి వెలయంగఁ జంపెద రణంబున నంచు నలంఘ్యవిక్రమో
ర్జితుఁ డయి దానిచుట్టు విడిసెం జతురంగమహాబలంబుతోన్. 151

క. మే లగుతత్పుర [4]బాహ్యవి, శాలోద్యానముల తాలసాల సరళ హిం
తాల తమాలావలి ని, ర్మూలితముగఁ జేసెఁ దచ్చమూసామజముల్. 152

వ. మఱితృణజలధాన్యసమిత్సమృద్ధం బయి [5]శతఘ్నీప్రముఖానేకయంత్రంబుల న
లంఘ్యపరిఘాప్రాకారంబులను నపారబలరక్షితఘనకవాట చతుర్గోపురంబులను
లబ్ధప్రభూతవేతన ప్రహృష్టపుష్ట ధృష్ట వీరసుభటసంకులంబులను నపరిమితగజతు
రంగ శతాంగంబులను బ్రదీప్తాలాతశాతశరచక్రతోమర పరశు పాశాంకుశ
కూటంబులను వీరయోధారూఢవిశాలాట్టాలకంబులను నొప్పి పరుల కసాధ్యం
బయినద్వారవతి భేదింపనేరక దానివెలిం బ్రపా చైత్య దేవాయతన వల్మీకం

1 నధర్మ. 2 వలచిన హితంబు పథ్యము...కెగ్గులుసేసిన ధార్తరాష్ట్రుల నెయ్యెడలన్. 3 వీరవరుఁ డెక్కడ బో(వో) నగు నాత నిన్నయో, న్నతి...నశక్యవిక్ర. 4 మార్గవి. 5 శతఘ్ని పరుషాగ్ని ప్రముఖానేకయంత్రఘనకకవాటంబు నలంఘ్య...ప్రతిపాలితనిశాత...శూలంబులను వి హారద్యోధారూఢ... దేవాయతనగుల్మవల్మీ.

బలు వర్జించి సమతలప్రదేశంబున నిబిడంబుగా శిబిరసన్నివేశంబు సేసి నిత్యం
బు నుపద్రవంబుసేయుచున్న సౌంభకవిజృంభణంబునకు [1]సహింపక సమరసం
రంభంబున సర్వాయుధసన్నద్ధు లయి. 153

క. ఉద్యద్బలులు కుమారులు, విద్యాధరసములు పురము వెలువడిరి రణై
కోద్యములు చారుదేష్ణుఁడుఁ, బ్రద్యుమ్నుఁడు సాంబుఁడును విపక్ష[2]జిఘాంసన్.

మణిభూషణము. రామవిక్రముఁ డజేయుఁ డరాతిగజావలీ
సామజాహితుఁడు సాంబుఁడు సాల్వచమూపతిన్
క్షేమవృద్ధి యనువాని నకృత్రిమసాహసో
ద్దాముఁ దాఁకె శరధారల [3]ధారుణిఁ గప్పుచున్. 155

క. జాంబవతేయు బృహద్విశి, ఖంబులకున్ [4]బెదర కెదిరి ఘనుఁ డేసె రణా
గ్రంబున నాతనిపై నవి, లంబితుఁ డై క్షేమవృద్ధి లక్షశరంబుల్. 156

వ. వానియేయు[5]నేర్పునకు సహింపక సాంబుండు జాంబూనదపుంఖంబు లయిన
విశిఖంబులం దదీయరథాశ్వమర్మంబుల నేసిన నవి మర్మభేదవేదనలం దలరి
యతివేగంబున రణంబు వెలువడ రథంబు బీడ్చుకొని సారథికి వశంబు గాక పఱ
చె నట్లు సాల్వచమూపతి సమరవిముఖుం డయిన. 157

స్వాగతము. వేగవంతుఁ డనువీరుఁడు సాంబున్, వేగవంతుఁ డయి[6]పేఁకను దాఁకెన్
వేగబాణపదవీతతులన్ ది, గ్భాగముల్ విశిఖపంజరముల్ గాన్. 158

ఆ. సాంబుఁ బాయు మనుచుఁ జారుదేష్ణుం డల్గి, వేగవంతుఁ దాఁకి పేఁకతోడ
వానిమస్తకంబు వ్రయ్యంగ వడి గదం, బొడిచె రుధిరవారిపూర మొలుక.

వ. ఇట్లు చారుదేష్ణునిష్ఠురగదాఘాతంబున వేగవంతుండు విగతజీవుం డయి నిర్ఘా
తపాతభిన్నోన్నతగిరిశిఖరంబునుంబోలె నేలఁ ద్రెళ్లినం జూచి వివింధ్యుం డను
వాఁ డవించిత్యవిక్రముం డయి. 160

తే. చారుదేష్ణుపైఁ గడువాఁడిశరము లేసె, నతఁడు కార్ముకహస్తుఁ డై యక్షణంబ
వానిపై నభిమంత్రించి వహ్నిబాణ, మేసె [7]నుగ్రస్ఫులింగంబు లెసఁగఁ జదల.

క. అనలాస్త్ర మట్లు వక్షముఁ, గొనిన వివింధ్యుండు గూలెఁ గుతలం బద్భుతవర్
ఘను వానిఁ జూచి హాహా,స్వనము లెసఁగ సాల్వసేన సంక్షోభించెన్. 162

వ. సాల్వుండు నిజసేనాసంక్షోభం బుడిచి సర్వాయుధసనాథం బయినరథం బెక్కి
యాదవకుమారవాహినిపయి నెత్తి యేయుచు వ్రేయుచుం బొడుచుచుఁ బ్రతి

1 నోపక సంరంభంబున సమరసన్నద్ధులై. 2 జిగీషన్. 3 దప్పక. ఈమణిభూషణవృత్తము ఒకప్రతియందు నుత్పలమాలికగాయున్నది. అ. 'ఆహవవిక్రముండును నజేయుఁడరాతిగజావలీసమా, జాహితుఁ డైన రాముఁడును సాల్వచమూపతి క్షేమవృద్ధియున్, ఆహవకేలిదాఁకిరి మహార్ణవవీచులభంగి సద్భుజో,త్సాహసమేతులై కడఁగి సైన్యము వక్కసమంది చూడఁగాన్.' 4 జెదర. 5 శరంబుల నేర్పున. 6 పేక నెదిర్చెన్....దిగ్భాగ మెల్ల శర. 7 ననలస్ఫులింగం.

బలంబునెల్ల నాయుధమయంబుఁగాఁ జేయుచున్న వాని కలిగి. 163
సీ. హంసవర్ణోత్తమహయములఁ బూనిన, రథ మెక్కి కాంచనరమ్యయష్టి
సంభృతమకరధ్వజం బొప్ప బద్ధగో, ధాంగుళిత్రాణుఁడై యతులశాత
సాయకావలిఁజేసి సాల్వుఁ బిల్చుచు వాని,మీఁదఁ బ్రద్యుమ్నుఁ డమేయబాణ
వర్షంబు గురిసిన వాఁడును వానిపైఁ, గడువాఁడిబాణముల్ గడఁగి యేసె
ఆ. నధికవీరు లయినయయ్యిద్దఱకు న, స్త్ర, కోవిదులకుఁ బోరు ఘోర మయ్యెఁ
[1]దద్ద భయము వొంది తద్ద్వారకాపురి, సౌభకమున జనులు సంభ్రమింప. 164
క. అనిమొన సాల్వుఁడు ప్రద్యు, మ్నుని శాతశరాలివిద్ధమర్ముం డయి పె
ల్చన మూర్ఛవోయి పడియెం, దనరథముపయిఁ ధరిత్రి దల్లడపడఁగన్. 165
ఉ. అంతన మూర్ఛదేఱి కలుషానలదీప్తముఖుండు సౌంభకుం
డంతకదండదారుణము లైనశరంబుల రౌక్మిణేయు ది
గ్దంతిబలాఢ్యు నేయుడు నతండును మూర్ఛితుఁ డయ్యె వాని సం
భ్రాంతిఁ దదీయసారథి యపాస్తరణాంతరుఁ జేసెఁ జెచ్చెరన్. 166
వ. ఇట్లు మూర్ఛితుండయిన ప్రద్యుమ్నుం దోడ్కొని చని రణంబునకు దూరంబుగా
నరదంబు నిలిపికొని దారుకసుతుం డున్నంత నొక్కింతప్రొద్దునకు మూర్ఛదేఱి
ప్రద్యుమ్నుండు సూతున కిట్లనియె. 167
క. ఘోరాహవరంగమునకు, దూరముగా నన్ను నిట్లు దోడ్కొని తేరఁ
దారకసుత నీ కుచితమె, వీరారంభంబు సూచి వెఱచితె చెపుమా. 168
వ. మఱియు సారథిం జూచి విహ్వల[2]మానసుం డయి యిట్లనియె. 169
క. సమరవిముఖత్వమును రణ, విముఖులఁ జంపుటయు శరణు వేఁడిన రక్షిం
పమియును యాదవవంశో, త్తము[3]లం దివి గలవె చెపుమ దారకతనయా. 170
క. విక్రమము విడిచి సమరా, పక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁడునుం
జక్రధరసుతులు ననుజులు, నక్రూరాదులును నేమి యని నగరె సభన్. 171
వ. చెట్టసేసితింక నయినఁ జెచ్చెర సాంబచారుదేష్ణు లున్నచోటికి సాల్వాభి
ముఖంబుగా రథంబు వఱపు మనిన సారథి యిట్లనియె. 172
క. రథి కిమ్ము గానియెడ సా, రథి[4] ధృతి మెయిఁ గావ వలయు రథియును దత్సా
రథిఁ గావ వలయు రథిసా, రథులు పరస్పరశరీరరక్షకు లగుటన్. 173
ఆ. సాల్వబాణవిగత[5]సంజ్ఞుఁడ వైనని, న్నిట్టుఁ దెచ్చితిని సహింప వలయు
నారథాశ్వముల మనస్స్యదమును నిదె, చూడు మనుచు సూతసూనుఁ డపుడు.
వ. సవ్యాపసవ్యచిత్రమండలగతుల నాక్షణంబ సాల్వునకు నప్రదక్షిణంబుగా
రథంబు వఱపిన దాని సహింపక సాల్వుండు మూఁడమ్ముల సారథినేసి మఱియు

1 తవిలి భయము. 2 పదనుం డై. 3 లకు నివి గలవె. 4 కెమ్మెయి గావ...వలయు సారథి,రథు
లు. 5 సత్త్వుండ...సహింపు దీని.

రాక్షసమాయ ననేకశరంబులు ప్రద్యుమ్నుపై నేసిన. 175

క. అమ్మాయాశరములు భ, గ్నమ్ములు గాఁ జేసి తన్ముఖమ్మునఁ దద్వ
క్షమ్మున నొక్కట [1]బ్రహ్మా, స్త్రమ్మును బ్రద్యుమ్నుఁ డేసె దారుణభంగిన్. 176

వ. ఇట్లు బ్రహ్మాస్త్రపీడితుం డయి సాల్వుండు మూర్ఛపోయి రథంబుపయిం బడిన వాని వెండియు నొక్కదివ్యబాణంబున నేయ సమకట్టిన నంతరిక్షంబున హాహారవంబు లెసఁగె నంత దేవగణప్రేరితు లయిననారద[2]మారుతులు ప్రద్యుమ్ను పాలికి వచ్చి యిట్లనిరి. 177

తే. వీఁడు నీచేత వధ్యుండు గాఁడు మున్న
కేయ కుండుము వీని నారాయణుండు
మొనసి వధియించు నని పల్కె వనజగర్భుఁ
డనినఁ బ్రద్యుమ్నుఁ డేయక యనఘుఁ డుండె. 178

సాల్వుఁడు ప్రద్యుమ్ను నిచే బాధితుం డై మరలి పోవుట.

వ. అంత సాల్వుండును నివృత్తుండయి ద్వారకాపురియవరోధం బుడిగి తనసౌంభకం బెక్కి క్రమ్మఱి చనియె నంత నీయజ్ఞంబు నిర్వృత్తం బయిన నే నరిగి బలభగ్నకృతపాదపవనంబులదాని ననభిజ్ఞాతద్వారదేశంబులదాని నస్వాధ్యాయస్వాహాకారస్వధాకారమహీసురాగారంబయినదాని నపేతభూషణయోషిజ్జనంబులదాని ద్వారవతిం జూచి యాహుకాత్మజువలన నంతవృత్తాంతంబును నెఱింగి సాల్వుం జంపి కాని యిప్పురంబు సొర నొల్ల నని నిశ్చయించి దీని నప్రమాదుల రై రక్షించుకొని యుండుండని బలదేవాదులం బంచి యప్పుడ ప్రయాణభేరి నఱవం బంచి కృతస్వస్తివచనపురోహితప్రముఖబ్రాహ్మణవరులకు నమస్కరించి శైబ్యసుగ్రీవంబు లనువాహంబులం బూనినదివ్యరథం బెక్కి. 179

ఆ. పాంచజన్యరవముఁ బంచమహాశబ్ద, రవముఁ జెలఁగె దిసెలు సెవుడుపడఁగ
నొలసి జనులదీవనలు మించె రమ్యమై, గరుడకేతనంబు గ్రాలెఁ జదల. 180

వ. అట్లసంఖ్యాతచతురంగసైన్యంబులతో నరిగి గిరి వన సరోవర సరిద్దేశంబులు గడచి[3]మూర్తికావతదేశంబున కరుగునంతకు ముందరసాల్వుండు సౌంభకారూఢుం డయి సముద్రకుక్షిదేశంబునకుం బోయిన. 181

క. ఏనును వానిపిఱుందన, మానక చని తచ్ఛమూసమాజముతో డక్షి
భూనాథ రణము సేసితి, నానానిశితాస్త్రవర్షణ[4]వ్యాప్తముగన్. 182

క. వీరు లగుసాల్వయోధుల, నారాచావళులు గప్పె నారథముపయిన్
[5]సారథిఁ దురంగములపయి, చారుధ్వజయష్టిపయి నసంఖ్యాతముగన్. 183

వ. వాని నెల్ల నస్మదీయగోచరంబులు గాకుండ ననేకాయుతశరంబు లేసి సాల్వ

---

1 బ్రహ్మాస్త్రిమ్మున. 2 పర్వతులు ; మాతులులు. 3 శర్కరానతదేశమున ; వార్తికాదేశమున. 4 వ్యాజమునన్. 5 సారథి మీఁదఁ దురంగమ, చారుధ్వజతతుల పయి.

సైన్యంబుతో మహాయుద్ధంబు సేసిన. 184

మ. అవనీనాథ తదాహవాంతరమునం దస్మత్కరాకృష్టశా
ర్ఙ్గవినిర్ముక్తనిశాతసాయకశతాగ్రచ్ఛిన్నమై దైత్యదా
నవదేహప్రకరంబు వాత[1]విధుతార్ణఃపూర్ణసంఘూర్ణితా
ర్ణవకుక్షిం బడియెం గపిప్రవరసైన్యక్షిప్తశైలాకృతిన్. 185

చ. ఘనతరదైత్యదానవనికాయకళేబరపాతఘట్టనం
దనరి యుగాంత్యకాలచలితంబునుబోలెఁ బయోధి మ్రోసె న
ధ్వనధిరవంబుకంటె ననివారితమై చెలఁగెఁ మదీయవా
హిని భటసింహనాద హయహేషిత సింధురబృంహిత ధ్వనుల్. 186

వ. అట్టిమదీయసేనోత్సాహంబును నిజసేనాక్షీణతయుం జూచిసహింపక సాల్వుండు వెండియు సౌంభకారూఢుం డయి నాతో మాయాయుద్ధంబు సేయ సమకట్టె.

సీ. పరశు పాశాంకుశ కరవాల శూల ము,ద్గరములునామీఁదఁ దెరలఁ [2]గురిసె
నేనును గడఁగి యద్దానవుశస్త్రముల్, వాయంగఁ జేసితి మాయఁ జేసి
వెఱవక సాల్వుండు వెండియు నామీఁదఁ, బరుషశిలావృష్టిఁ గురిసె వరుస
నమరఁ దమఃప్రకాశములతో దుర్దిన, సుదినశీతోష్ణముల్ గదియఁ జేసి

ఆ. దితిసుతాధముండు శతసూర్యశతచంద్ర, శతసహస్రవిష్ణుతతులు వెలుఁగ
గగనతలము సేసెఁ బగ లిది రే యిది, యని యెఱుంగ నయితి మనములోన.

క. మనుజేంద్ర సర్వమాయా, పనోదనం బయినయగ్నిబాణంబున న
[3]ద్దనుజవినిర్మితమాయా, వినివర్తనఁ జేసితిని సవిస్మయమతినై. 189

వ. అట్టియవసరంబున ద్వారవతినుండి యాహుకప్రేషితుం డయి యొక్కరుం డతిత్వరితగతిం బఱతెంచి సాల్వుచేత నక్కడ వసుదేవుండు పట్టువడియె నీ వెవ్వనితోడం గయ్యంబు సేసెదు క్రమ్మఱి చని పురంబు రక్షించుకొను మనిన విని యదరిపడి మహాబలపరాక్రము లయినబలదేవాదులు రక్షించుకొని యుండ వసుదేవుఁ డేల పట్టువడు నిది పోల దని సంశయించుచు విమనస్కుండ నయి యుండు నంత. 190

సీ. పుణ్యకర్మంబులు వోలిసిన నుర్విఁ కి, నేతెంచునట్టియయాతివోలె
భూషణదీప్తులు వోలియంగ వివృతకే, శాంబరుం డయి సౌంభకంబువలనఁ
బడుదెంచువసుదేవుఁ బాపనిశాచర, బలపీడ్యమాను దవ్వులనఁ గాంచి
యత్యంతమోహశోకాంధుండ నయిననా, హస్తంబువలన విస్రస్త మయ్యె.

ఆ. శార్ఙ్గ మప్రియావసన్న దేహుండనై, యుడిగి రథముమీఁదఁ బడితి నేను
దానిఁ జూచి భయము దగిలి మత్సైన్యంబు, దల్లడిలి[4]యులిసెఁ బెల్లురేఁగి.

---

1 విహతార్ణః; నిహతార్ణః; విధురాంభః. 2 కదిసిన. 3 దనుజావిని...సవిస్తరమతి. 4 యవిసె.

వ. అంత నెంతయుం బ్రొద్దునకుఁ దెలిసి సాల్వుసౌంభకంబున వసుదేవుం గానక దాని మాయఁగా నెఱింగి పదంపడి మాయావి యయినసాల్వుం జూచి వానిపయి నలిగి యే నేసిన నయ్యసురయు సౌంభకంబు నదృశ్యం బగుటయు. 192

క. అసురులయాక్రోశధ్వను, లెసఁగెం బదిదిశల నంత నేసును దద్రా
క్షసులఁ గతాసులఁ జేసితిఁ, బ్రసభంబున శబ్దభేదిబాణప్రతతిన్. 193

వ. అంత సాల్వుండును దనసౌంభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జేసి తానును [1]దానవుండయి పర్వతవర్షంబు నాపయిం గురిసిన. 194

ఆ. పరుషవిషమభూరిపాషాణభీషణ, గిరులు వచ్చి నన్నుఁ దెరలఁ గప్ప
వజ్రబాణ మేసి వాని నన్నింటిని, బాచి యున్ననన్నుఁ జూచి యపుడు. 195

క. దారుకుఁ డిట్లనియె మహా, వీరు నుపేక్షింపఁ దగునె వీనిని మాయా
ప్రారంభు నుపేక్షింప ర, పారపరాక్రములు పోరఁ[2] బలియుఁడువీనిన్. 196

వ. అనిన వానిపలుకులు విని యలిగి యనలజ్వాలాకరాళం బయి ప్రతికూలరాక్షస యక్ష గంధర్వ దైత్య దానవభస్మసాత్కరణదారుణం బయినచక్రంబు నభిమంత్రించి సౌంభకంబుపయి వైచిన నది యుగాంతకాలపరివేషభీషణం బయిన రవిమండలంబునుం బోలె గగనంబునం బఱచి సౌంభకమధ్యంబునం బడిన.

చ. తడయక ఘోరదర్శనసుదర్శనపావకుచే దహింపఁగాఁ
బడి పరమేశ్వరోగ్రశరపావకదగ్ధపురత్రయాభ మై
యెడరి ధరిత్రిమీఁదఁ బడియెం జెడి సౌంభక మంత సాల్వుఁడుం
బడియె మదీయచక్రపటుపాతరయంబున రెండువ్రయ్య లై. 198

### పాండవులు ద్వైతవనంబునకు వచ్చి యుండుట.

వ. అని యిట్లు సాల్వుం దనచంపిన విధంబు సెప్పి చక్రధరుండు పాండవుల వీడ్కొని సుభద్రాభిమన్యులం గాంచనరథం బెక్కించుకొని తోడ్కొని ద్వారవతి కరిగె ధృష్టద్యుమ్నుండును బ్రతివింధ్యాదు లయినద్రౌపదేయులం దోడ్కొని ద్రుపదుపురంబునకుం జనియె నిట పాండవులును రథంబు లెక్కి యాయుధంబులు ధరియించి యింద్రసేనాదిమూలభృత్యు లిరువదుండ్రు ముందట రా ననేకసహస్రబ్రాహ్మణవరులతో ద్వైతవనంబున కరిగి రంత ధర్మరాజు తమ్ముల కిట్లనియె.

మధ్యాక్కర. ఇది మహోగ్రాటవి సింహశరభోరగేంద్రశార్దూల
మదగజాకీర్ణంబు దీనిలోన నేమఱ కుండ వలయు
నదియునుం గాక పరప్రయోగమాయలు గల వెఱఁగి
మది నుండునది యన్న నన్న కిట్లను మఘువనందనుఁడు. 200

వ. బ్రహ్మవిదు లయినతపోధనబ్రాహ్మణులును వృద్ధులు నఖిలలోక ద్వారంబుల

1 దానవుం డయి శిలాకలాపలాపితలతాగుల్మవల్మీకమహాపాదపం బగుపర్వతవర్షంబు. 2 ప్రాకృతు (వీనిన్) నయినన్.

నప్రతిహతు లయిననారదద్వైపాయనాదిమునివరులు నీచేత నుపాసితు లయి
నీకుశలంబ కోరు చుండుదురు భవత్ప్రతాపంబెల్లవారిని రక్షించు నివ్వనంబు
సకల కాలకుసుమఫలభరితవనస్పతి శాఖాశిఖారూఢమయూరకీరకోకిలాలాప
మధురంబును బక బలాక కోక కారండవ సారస రమ్య మధుకరసౌమ్యసరో
వరసంకులంబును విమలశీతలజలప్రవాహానదీశోభితంబును మహర్షిగణసేవితం
బునునై యొప్పుచున్నయది యిందుండుదమని లలిత[1]లతావితానాదిరమణీ
యంబులయినవృక్షమూలంబుల నేవురు వేఱువేఱ నివాసంబులు సేసి నియ
తాత్ము లయి యిష్టంబున దేవపితృకార్యంబులు సేయుచుం దమ్ముం జూడ వచ్చి
న మహామునులకుబ్రాహ్మణులకు మనఃప్రియంబు లయినయాహారంబులువెట్టు
చు ద్వైతవనంబుననుండు నంత. 201

క. పాండవులకడకు ధర్మవి, దుండు దపోదహనదగ్ధదురితౌఘుఁడు మా
ర్కండేయుం డనుమునినా, థుం డం తేవాసిగణముతోఁ జనుదెంచెన్. 202

వ. ఇట్లు వచ్చి వారలచేత నర్చితుం డయి వనవాసక్లేశదుఃఖితు లయినపాండవులను
ద్రౌపదిం జూచి యమ్మార్కండేయుం డిట్లనియె. 203

సీ. పితృనిదేశమ్మునఁ బృథివీశ్వరత్వంబు, విడిచి సానుజుఁడై పవిత్రచరిత
జానకిఁ దోడ్కొని చని వనంబున నున్న, రఘుకులనందను రాముఁ దొల్లి
చూచితి నిపుడు భూసురవంశపోషకు, సాధుజనస్తుత్యు సత్యధర్మ
నిత్యు ధర్మజు రమణీయకీర్తిప్రియు, శమవంతుఁ జూచితి సగర భరత

ఆ. నల యయాతి వైన్య నాభాగు లాదిగ, నాదిరాజు లెల్ల నధికధర్మ
సత్యయుక్తిఁ జేసి సకలలోకంబులు, వడసి భాగధేయభాగు లయిరి. 204

వ. పాపసౌబలప్రయుక్తుండయినధార్తరాష్ట్రునట్లు ధర్మువుదప్పినవా రెవ్వరును లేరు
మీరు ధర్మనిత్యులరు సత్యవ్రతులరు గావున మీ కిష్టసిద్ధి యగు నని మార్కం
డేయుం డరిగిన నపరసంధ్యోపాసనాసీనుం డయినధర్మరాజును సాయంహోమా
ర్థప్రజ్వలితజ్వాలనంబు లయిన యనేకసహస్రబ్రాహ్మణాగ్నిహోత్రంబులం జూచి
బకదాల్భ్యుం డనుమహాముని యి ట్లనియె. 205

ఉ. భూమిసురోత్తముల్ ప్రకృతి పుణ్య[2]విధాయులు వీరు ఋగ్యజు
స్సామపరాయణుల్ పరమసాధుచరిత్రులు మీకు సంతత
ప్రేమమునన్ శుభోన్నతులు వెంచుచు నుండుటఁ జేసి సద్గుణో
ద్దామ మరణ్యవాస మిది దద్దయు నొప్పెడు మాకుఁ జూడఁగన్. 206

వ. బ్రాహ్మణానుగ్రహంబునం జేసి తొల్లి వైరోచనాదు లనేక కాలంబు లక్షయలక్ష్మీ
విభవులయి సముద్రనేమిభూచక్రంబు రక్షించిరి యనిలసహాయుండయినయగ్ని
దేవుండరణ్యంబులు దహించునట్లు బ్రాహ్మణసహాయుండయినమహీశుండు శత్రు

1 లతావితానాతి. 2 విధేయులు; విధానులు.

వర్గంబు నిశ్శ్రేయసంబు సేయు వినీతుం డయి విప్రులచేత[1] ననుశాసితుం డయినరాజునకు నలబ్ధలాభాదిత్రితయంబు సంపన్నం బగు బ్రాహ్మణరహితుం డయి ధర్మహీనుం డయినరాజును బ్రజ వలవదు ప్రజానురాగంబు లేనివానికి రాజ్యంబు సుస్థిరంబు గానేరదు మీరు బ్రాహ్మణప్రియులరు ధర్మనిత్యుల రెప్పుడును మీ కభ్యుదయం బగు నని బకదాల్భ్యుం డరిగినఁ బాండవులుం దమయిష్టంబుననుండి దుఃఖోపశమనంబు లయినకథలు సెప్పుకొను చున్నయవసరంబున ద్రౌపదిధర్మరాజున కిట్లనియె. 207

## ద్రౌపదీధర్మరాజుల సంవాదము.

వృద్ధు గొడుకుపలుకు విని [2]క్రూరుఁ డై పాప, బుద్ధిఁ జేసి మిమ్ము భూతలంబు
వెలువరించి రాజ్యవిభవంబు గొనియుప్పొ, డలుక సెడి సుచిత్తుఁ డయ్యెనొక్కొ.
అద్దురాత్ముహృదయ మది యయఃపాషాణ, నిష్ఠురంబు ధర్మనిధుల మిమ్ము
నట్లు గొడుకు లెగ్గు లాడంగఁ బోయిన, [3]వల దనండ కలహవాంఛఁ జేసి.
విమలహర్మ్యంబుల విహరించువారలఁ, బ్రియ[4]మహార్హాసనశయనరతులఁ
జందనాగురులిప్తచారుసర్వాంగుల, నతనరనాథసేవితుల మిమ్ము
వనమునఁ గ్రుమ్మరువారిఁగాఁ గుశబృసీ, శయనాభిరతులఁగా నియతరూక్ష
భూరేణుధూసరీభూతవిగ్రహులఁ గా, ద్రుతవన్యమృగనిషేవితులఁ గాఁగ
నిట్లు సూచి చూచి యే నెట్లు చిత్తోప, శాంతి సేయుదాన సకలభోగ
విషయవిరతిఁ జేసివిధియును ధృతరాష్ట్రు, నట్లు మీకు నహితుఁ డయ్యెనొక్కొ.
భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ
యవరజు లిడుమలఁ బడి కడుఁ, జివికిరి చెఱఁ బడినసింహశిశువులభంగిన్. 211
పరనరేంద్రమకుటపద్మరాగద్యుతి, నరుణ మగుభవత్పదాబ్జయుగము
[5]పరుషదారుశిలలపై నిప్పు డరుగుట, నరుణ మయ్యెఁ బర్వతాంతరముల. 212
అనవరతసౌఖ్యసంపదఁ, బెను పొందుచు నుండుమీకు భీకరకాంతా
రనివాసాయాసంబుల, ననఘా యిబ్బంగి నవయ నలమట వొడమెన్. 213

నిత్యంబునుం బదివేవురు బ్రాహ్మణులు బ్రహ్మవిదులు [6]బసిండితళిగల నిష్టాన్నంబులు గుడిచి తృప్తు లయినం దద్భుక్తశేషం బుపయోగించు చున్ననీకు వన్యమూలఫలాశనంబు లుపయోగించుచు నన్యులయందుఁ గ్రోధంబు విడిచి యునికి యుచితంబు గాదు. 214

పదివేలగజముల బలమున విలసిల్లు, ననిలసుతుండు గాఁ బడవిలోనఁ

---

1 నధిష్ఠితుం డయిన ; ననుష్ఠితుం డయిన ; వినీతుం డయిన ; శిక్షితుం డయిన రాజునకు నలాభాదిచతుర్వర్గంబు ... ప్రజ వొందదు ... రుచిరంబు గానేరదు. 2 పాపబుద్ధి యై, పొద ముట్లు మమ్ము ; క్రూర హృదయుఁ డై, నీతిమాలి మిమ్ము. 3 వలవ దనఁడ. 4 మహార్హామృ యన. 5 పరుషధాతు. 6 పసిండి పళ్లియల ; బసిండి పళ్లెరంబుల.

గ్రుమ్మరి కాయలుఁ గూరలుఁ దిని పేద, వడినఁ జూచియు దీర్ఘబాహుయుగళుఁ
డయ్యును బాహుసహస్రంబు గలిగిన, యర్జునుకంటె బలాఢ్యు డగుచు
నేకవేగంబున నేనమ్ము లొక్కయ, మ్మేసినవిధమున నేయ నేర్చు
ఆ. నర్జునుండు వనమృగావలిఁ గలిసి యి, ట్లున్నఁ జూచియును సుఖోచితాత్ము
లై నకవలు దీను లై యున్నఁ జూచియు, నుపశమంబుఁ దాల్చియుండఁదగునె.

వ. క్షమయును దేజంబును నయ్యయికాలంబులఁ బ్రయోగింప నేరనిరాజునకుం బ్రజానురాగప్రతాపంబులు లే వనునీయర్థం బితిహాసంబున వినంబడు క్షమాతేజంబులలోన నెయ్యది విశేషంబు దానిన నిర్ణయించి చెప్పుమని బలీంద్రుండు దొల్లి తనపితామహుం డయినప్రహ్లాదు నడిగిన నాతండు బలీంద్రున కిట్లనియె. 216

ఆ. [1]క్షమయ తాల్చి యుండఁ జనదెల్లప్రొద్దుఁ దే, జంబ తాల్చి యుండఁ జనదు పతికి
సంతతక్షముండు సంతతతేజుండు, నగుట దోష మందు రనఘమతులు. 217

వ. ఎట్లనిన నిత్యక్షమాన్వితుం డయినవానికి భృత్యులు వెఱవక యవమానంబు సేయుదు రర్థంబులయం దధికృతు లయినవారలు ధనంబు లపహరించి దర్పంబు సూపుదురు మఱి నిత్యతేజోధికుం డైనవాఁ డతిక్రూరదండంబున సర్వజనసంతాపంబు సేయుచు గృహగతం బైనసర్పంబునుంబోలె నెప్పుడు నుద్వేగకరుం డగుం గావునఁ గాలోచితంబులుగా క్షమాతేజంబులు గల్పించునది యథాకాలకల్పితక్షమాతేజుం డైనవానికి నుభయలోకసిద్ధి యగు నని బలీంద్రప్రహ్లాదసంవాదంబు సెప్పి వెండియు ద్రౌపది యిట్లనియె. 218

తే. [2]ఆది నపరాధ మొక్కటి యైన నదియు
నల్పమైనను క్షమియించు నదియుఁగాక
చెనసి యపరాధములు పెక్కు సేయు చున్న
పాపకౌరవ్యులకు సహింపంగ నేల. 219

క. ఇది తేజంబున కవసర,ముదితక్రోధుండ వగుమ యొక్కించుక దు
ర్మదు లగుసుయోధనాదుల, నడయుల వధియింతు రుగ్రు లై [3]నీతమ్ముల్. 220

వ. అనిన ధర్మరా జిట్లనియె. 221

సీ. క్రోధంబు పాపంబు క్రోధంబుననచేసి, యగుఁ జువ్వె ధర్మకామార్థహాని
గడుఁగ్రోధి గర్జంబు గానండు క్రుద్ధుండు, గురునైన నిందించుఁ గ్రుద్ధుఁ డైన
వాఁ డవధ్యుల నైనవధియించు మఱియాత్మ, ఘాతంబు సేయంగఁ గడఁగుఁ గ్రుద్ధుఁ
డస్మాదృశులకు ధర్మానుబంధుల కిట్టి, క్రోధంబు దాల్చుట గుణమె చెపుమ

---

1 క్షమయుఁ దేజంబును సమమైన నగు (సమమైన దగు) గాని, క్షమయదాల్చి యుండ జనను పతికి....సంతత తేజుఁడై, యునికి పాపమందు. 2 అరయ నపకార మొక్కటి యైన నల్ప, మైన శమియించు నది గాక యలయ కిపుడు; అధిప యపరాధ మొక్కండ యైన నదియు. నీ యనుజుల్.

ఆ. యెఱుక గలమహాత్ముఁడెఱుక యన్గలముల, నార్పుఁ గ్రోధ మనుమహానలంబు
గ్రోధవర్జితుండు గుఱుకొని తేజంబు, దాల్చు దేశకాలతత్త్వ మెఱిఁగి. 222

క. క్షమ గలవానికిఁ బృథ్వి, సమునకు నిత్యంబు [1]విజయసంసిద్ధి యగుఁగ
క్షమి యైనవానిభుజవి, క్రమము గడుఁగ వెలయు సర్వకార్యక్షమ మై. 223

వ. తేజఃప్రభవంబు లైనయమర్ష దాక్షిణ్య శౌర్య శీఘ్రత్వంబు లనునాలుగు గుణంబులు క్షమావంతునంద వీర్యవంతంబు లగుఁ దొల్లి కశ్యపగీత లైన గాథలయం దీయర్థంబు వినంబడు వినుము వేదంబులు యజ్ఞంబులు శౌచంబును సత్యంబును విద్యయు ధర్మువు సచరాచరం బయినజగ మంతయు క్షమయంద నిలిచినవి తపస్స్వాధ్యాయయజ్ఞకర్తలయు బ్రహ్మవిదులయుం బడయు పుణ్యగతులు క్షమావంతులు వడయుదు రదియునుంగాక కృష్ణద్వైపాయన భీష్మ విదుర కృప ద్రోణసంజయప్రభృతులు నాయుపశమంబ కీర్తింతు రుపశమహీనుం డయినదుర్యోధను కారణంబున ధార్తరాష్ట్రుల కెల్లం బ్రళయం బగు ననిన ద్రౌపది వెండియు నిట్లనియె. 224

మధ్యాక్కర. క్షమయంద చిత్తంబు నిల్పి నిర్గతకల్మషబుద్ధిఁ
గ్రమమున ధర్మువు నంద వర్తిల్లు కరుణాత్మ నిన్ను
సమరంగ ధర్మువు [2]రక్షించుఁ బ్రీతి నని శత్రు లందు
శమబుద్ధి సేయంగఁ జనునె నీకు నజాతశత్రుండ. 225

ఆ. ధర్మదూరు లైనధార్తరాష్ట్రులయం ద, ధర్మ వేమి సేయు ధరణినాథ
నికృతిపరులయందు నికృతి సేయనివారు, వారినికృతిఁ జేసి వధ్యు లండ్రు. 226

క. ఆర్యులకు విహీనతయు న, నార్యుల కున్నతియుఁ జేసి యవినీతుఁడ వై
కార్యము దప్పితి నీకు న, నార్యులు చుట్టములె యార్య[3]లరులె విధాతా. 227

వ. అని విధాతృని ధర్మువు నాక్షేపించు ద్రౌపదిం జూచి ధర్మరా జిట్లనియె నాస్తికులయట్లు ధర్మాభిశంకిని వై దైవదూషణంబు సేసెదు శిష్టచరితం బయిన ధర్మంబు [4]నధిక్షేపించు చున్నదుర్మతికిం బ్రాయశ్చిత్తంబు లేదు ధర్మువు దప్పక నిత్యులై జీవించు చున్నమైత్రేయ మార్కండేయ వ్యాస వసిష్ఠ నారదప్రభృతులం బరమయోగధరులం బ్రత్యక్షంబ చూచెదము వీ రెల్లనన్ను ధర్మపరుం డని మన్నింతు రన్యు లన్యాయంబు సేసిరనియు నే నేల ధర్మువు దప్పెదు. 228

క. ధీరమతియుక్తిఁ జేసి వి, చారింపఁగ నిక్కువంబు సర్వజనస్వ
ర్గారోహణసోపానం, బారఁగ ధర్మంబ చూవె యతిరమ్యం బై. 229

వ. తప స్స్వాధ్యాయ బ్రహ్మచర్య దానధర్మయజ్ఞంబు లనుపుణ్యకర్మంబు లఫలంబు లగునేని వీని నేల [5]ఋషిగణంబులు సేవింతురు నీజన్మంబును ధృష్టద్యుమ్ను

1 ధర్మసంసిద్ధి యగుఁగ. 2 రక్షించుచున్న ... సమబుద్ధిఁ జేకొన నగునె నీకు. 3 లన్యులె చెపుమా. 4 శంకించు చున్న; నతిక్రమించు చున్న. 5 దేవర్షిగణంబులు.

జన్మంబును బుణ్యాకర్మఫలసద్భావంబునకు నిదర్శనంబులు గావె మఱి పుణ్యఫలంబులు గలయట్లు పాపఫలంబులును గలవు తొల్లి బ్రహ్మ దనపుత్త్రులకుం గర్మఫలసద్భావంబు సెప్పె నందుఁ గశ్యపుండు ధర్మప్రబోధనంబునం జేసిపుణ్యఫలప్రాప్తుం డయ్యె విధాతృనియోగంబునం బుణ్యపాపఫలంబు సంప్రాప్తంబగు విధాతృననుగ్రహంబునన కాదె పుణ్యకర్మంబులు ప్రవర్తించి [1]మర్త్యులమర్త్యత్వంబును బొందుదు రనిన విని ద్రౌపది యిట్లనియె. 230

ఆ. [2]కర్మఫలము లేదు కర్మఫలాప్తికిఁ, గారణంబు విధియుఁ గాదనంగ
నంత యెఱుక లేనె యార్తనై విధిచేతఁ, గలసి పలికితిం బ్రియంబు దప్పి.

ఆ. వేదశాస్త్రములును విధివిధానములును, నప్రమాణ మనుదురాత్మకులకుఁ
బుణ్యగతులు లేమి భూనాథ యెఱుఁగని, దానఁ గాను ధర్మతత్త్వయుక్తి.

వ. తొల్లి నీతిమంతు లయినబ్రాహ్మణులు మదీయజనకునకుం జెప్పంగ వింటి నెఱుకగలవారికిం గర్మంబు గర్తవ్యంబు గర్మరహితు లయి స్థావరంబులయట్లు జనులు జీవింప నేర రల్పఫలంబు నైనను గర్మంబుఁ బ్రవర్తించుచున్నవారిం జూచెదము దైవమానుషంబులు గర్మఫలప్రాప్తికి నిమిత్తంబులు పురుషుండు మనంబున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందుఁ గృతోత్సాహుండు గావలయు నట్టివానికి దైవంబు సహాయం బయి కర్మసిద్ధి గావించు. 233

మధ్యాక్కర. తిలలందుఁ దైలంబు గాష్ఠములయందుఁ దిరముగా నగ్ని
గలుగు టెఱిఁగి యుపాయపూర్వమునఁ గడఁగి తత్సిద్ధి
యలయక యుత్సాహవంతుఁడు వడయు నట్లనుత్సాహ
మొలసి దైవపరుఁ డిది వడయంగను నోపునె యెందు. 234

మధ్యాక్కర. కడు నిమ్ముగా దున్ని బీజములు సల్లి కర్షకుం డున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ దత్ఫలసిద్ధి
నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపనినాఁ డేమి సేయుఁ
గడఁగి చేయం గలదానిఁ జేయును గాక కర్షకుఁడు. 235

వ. కర్మఫలంబులు దైవమానుషసిద్ధంబు లయినను బురుషోత్సాహసముపార్జితంబు లయిన నవి సుస్థిరంబు లయి సురక్షితంబు లయి వర్తిల్లు [3]ననీహమానుం డయి దైవపరుం డయినవాఁడు నీరిలోనియామపాత్త్రంబునుంబోలె నవసన్నుం డగుం గావునఁ గర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండ వయి నీయనుజులపరాక్రమంబునం బరుల జయించి మనయందలియర్థకృశత్వం బపనయింపు మనిన యాజ్ఞసేనివచనంబుల కనుగుణంబుగా భీమసేనుండు ధర్మరాజున కిట్లనియె.

---

1 మహాత్ములు మర్త్యంబుఁ బొంద రనిన. 2 కర్మఫలమునందు; కర్మఫలములందు...విధిచేతఁ, గదలి. 3 నమానుషుం డయి...నావసన్నుం డగు.

భీమసేనధర్మరాజుల సంవాదము.

మ. పితృపైతామహ మైనరాజ్య[1]మరినిర్భేద్యంబు గాండీవిచే
నతిగుప్తంబు బలారికైనను నవార్యం బిట్టిదానిన్ సుదు
ర్మతి నన్యాయ్యము సేసి నీకుఁ జనునే మర్త్యేశ యుగ్రాటవిన్
వ్రతముల్ సల్పుచు ధర్మలేశచరణవ్యాసక్తిని ట్లుండఁగన్. 237

క. ఆమిషము సింహములచే, గోమాయువు గొన్నయట్లు కువలయరాజ్య
శ్రీ మనచేఁ గొని కౌరవుఁ, డేమని తలఁచునొకో బుద్ధి నిష్టులుఁ డానున్.

క. దుర్మతులను దుర్జనులను, ధర్మస్థితి నోర్వఁ దగునె ధరణీశ్వర దు
ష్కర్ములగు ధార్తరాష్ట్రుల, పేర్మి [2]యడంగింపఁ గడఁగు పృథుభుజశక్తిన్. 239

వ. ధర్మకామప్రభవం బయి సర్వార్థసాధనం బయినయర్థంబు విడిచి మిత్రులకప్రి
యంబు నమిత్రులకు హర్షంబునుంగా మునివృత్తిం జేకొని ధర్మువు ధర్మువను
చు[3]ధర్మువునందు చిత్తంబునిలిపి దుర్బలునట్లుండ దగునె. 240

ఆ. బాహుబలము మెఱసి పరులసంపదలు సే, కొనఁగ లావు లేనికుత్సితుండు
నియతదుఃఖవృత్తి [4]నిర్వేదపరుఁ డగుఁ, గాక నీకుఁ దగునె కౌరవేంద్ర. 241

చ. నరసుత నీయనుజ్ఞఁ గొని నాఁడ విరోధుల నెల్లఁ బోరిలో
సరభసవృత్తి నుక్కడఁగఁ జంపితి మేని మహోగ్రకాననాం
తరముల నుండ కుండ నతిదారుణదుర్మృగసంగమంబునం
[5]బొరయక యుండఁగా మనకుఁ బోలు నమందమనఃప్రియంబుగన్. 242

క. సమయాతిక్రమభీతిని, క్షమాయుతుల మైనమనలఁ గౌరవులు పరా
క్రమహీనులుగాఁ దలఁతురు, సమరోత్సాహంబు విడిచి [6]జడమతి నున్నన్.

తే. తగిలి నిత్యంబు నేకాంతధర్మనిరతుఁ, డగుట యుక్తమె పురుషున కట్టివాని
వెలయ ధర్మకామంబులు విడుచుఁ బ్రాణ, విగతు సుఖదుఃఖములు రెండువిడుచు నట్లు.

సీ. ధర్మకామంబులు దఱుఁగంగ నర్థార్థి, యగువాఁడు పలితుఁడౌ [7]నర్థసేవ
నర్థార్థముగఁ జేయునతఁ డుగ్రవనములోఁ, గోరక్ష సేయునక్కుమతిఁబోలు
నర్థధర్మములకు హానిగాఁ గామార్థి, యగునాతఁ డల్పజలాశయమున
జలచరం బెట్టు లజ్జలములతోఁ జెడు, నట్లు కామంబుతో హానిఁ బొందు

ఆ. నర్థధర్మములు మహాబ్ధిమేఘములట్లు, లుభయమును బరస్పరోదయమ్ము
లిట్లు గాఁ ద్రివర్గ మెఱిఁగి సామ్యమున సే, వించువాఁడు సర్వవిత్తముండు.

వ. భవదాచరితం బైనయీధర్మం బర్థకామంబులకు కాదు నీకును నీబాంధవులకు

---

1 మదనిర్భేద్యంబు. 2 యడంగింపఁ దగదె ; యడంగింపఁ దగును. 3 ధర్మంబునంద బుద్ధి నిలిపి దుర్మనుజు నట్లు నిర్వేదింప. 4 నిర్వేదహతుఁ డగు. 5 బొరయకయుండఁగాఁ గలుగుఁ బొందదు వైరి మనగ ప్రియం బొగిన్ ; బొరయకయుండగాఁ గలుగఁ బోలునె వైరి మనగ ప్రియం బొగిన్. 6 జవమరి యున్నన్. 7 ధర్మశీలు... సేయని కుమతిఁ... సౌమ్యమున.

ను [1]బాధాకరంబు దానయజ్ఞసత్పూజలు గావింప నర్థహీనున కశక్యంబు జగం
బులు ధర్మమయంబులు ధర్మువునకు మిక్కిలి యొండెద్దియు లే దయినను నర్థా
ర్థంబు గానిధర్మువు క్షత్త్రియుల కయుక్తంబు. 246

ఉ. శత్త్రుల నాజి నోర్చుటయు సర్వభయంబులఁ బొంద కుండఁగా
ధాత్త్రిఁ బరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం బ్రియంబుతోఁ
బాత్త్రుల కర్థమీఁగియును బ్రాహ్మణపూజయుఁ జువ్వె యుత్తమ
క్షత్త్రియధర్మముల్ సుగతికారణముల్ విపులార్థమూలముల్. 247

వ. కేవలధర్మాచరణంబు శత్రుజయంబునకు సాధనంబు గాదు [2]నికృతి వలయుఁ బూ
ర్వభ్రాత లైనయసురుల నమరులు నికృతిన కాదె నిర్జించిరి కావున నీవు సమ
యధర్మరక్షణవ్రతం బుడిగి శత్త్రువుల జయింప నుద్యోగింపుము. 248

క. జయశీలి వైననీకుం, బ్రియ మొనరింపంగ నున్నపృథుయశులు ముదా
శ్రయు లగుదురు సృంజయకే,కయయదుపాంచాలురాదిగాఁ గలసుహృదుల్.

తే. మిత్త్రసంపన్నుఁడైననమిత్త్రు మిత్త్ర,బలముతోడ భేదించి దోర్బలముఁ జలముఁ
గలిగి దేశబలంబును గాలబలముఁ, గలుగువాని కసాధ్యంబు గలదె యెందు.

తే. బలము గలవానిఁ బలువురు బలవిహీను,లొక్కటైకూడి నిర్జింతు రుత్సహించి
మధువుఁ గొనను త్సహించినమనుజుఁ బట్టి, కుట్టి నిర్జించుమధుకరకులమునట్లు.

వ. [3]శ్వదృతియందలిదుగ్ధంబునుంబోలె దుర్యోధనురాజ్యంబు దూష్యం బగుటఁ బౌర
జానపదబ్రాహ్మణవరులు నీ కనురక్తు లయి భవద్రాజ్యంబ వలచి యుండుదురు దీని
నేల యెడ సేసెదు సర్వాయుధసనాథం బైనరథం బెక్కి గజపురంబున కభి
ముఖుండవై విజయప్రయాణంబు సేయుము. [4] 252

మ. ప్రణుతక్షాత్త్రగుణంబు విక్రమము దర్పం బేర్పడఁగ విక్రమ
క్షణదానం బొనరింపు మీక్షణమ విఖ్యాతంబుగా సంగరాం
గణమధ్యంబునఁ జేయు మర్జునబృహద్గాండీవనిర్ముక్తమా
ర్గణధారావళి ధార్తరాష్ట్రకదళీకాంతారవిచ్ఛేదమున్. 253

క. [5]బహురథగజవాహనభట, సహితులు బలవంతు లని విచారింపకు నీ
యహితులు మద్బాహుగదా, నిహతికి మార్కొనఁగఁ బోర నిలువంగలరే.

క. అరివరుల నోర్చి సాగర, పరివృతభూచక్ర మెల్లఁ బాలింపు ప్రజా
పరిపాలనంబుకంటెను, ధరణీశ విశేష మొండు ధర్మువు గలదే. 255

వ. రాజ్యపదస్థుం డైనక్షత్త్రియుండు భూరిదక్షిణంబు లైనయజ్ఞంబుల [6]దేవబ్రాహ్మ
ణులం దృప్తులం జేసి బ్రాహ్మణులకు నగ్రహారంబులు గోసహస్రంబులు నిచ్చుచు

---

1 బాధాకరంబు లట్లుగాకుండ దాన...ధర్మువు క్షత్త్రియుల కుత్తమంబు. 2 నికృతి పరుల యందు నికృతియ వలయుఁ. 3 శూద్రాన్నంబునందలి; క్షుద్రాన్నంబునందలి. 4 ఇది విజయప్రారంభంబున కవసరంబు. 5 బహువాహసుభటహస్తిక. 6 బ్రాహ్మణవృత్తినడిపి తృప్తిచేసి.

రితంబులవలనం బాసి తమోవిముక్తుం డైనచంద్రుండునుంబోలె వెలుంగు
నని భీమసేనునకు ధర్మరాజి ట్లనియె. 256

ఉ. నీవచనంబు ధర్మ్యము వినీతము [1]నీతియుతంబు నిష్టసి
ద్ధ్యావహ మత్యుదార మిది యైనను నిప్డు దలంపఁగా విచా
రావసరాప్తికిన్ విషయ మైనది కార్యఫలంబు లెల్ల స
ద్భావమునన్ విచారసులభంబుల యండ్రు విచారపారగుల్. 257

క. వనమునఁ బండ్రెం డేండ్లును, జనపదమున నెఱుఁగ కుండ సరి నొకవర్షం
బును [2]జలుపఁ బూని సత్యము, దనరఁగఁ జేసితిఁ బ్రతిజ్ఞ దగ వృద్ధసభన్. 258

చ. అలఘుగుణంబులం దధికుఁ డైనమహాత్ముఁడు [3]రాగకోపమా
యలఁ బడి యక్షమావివశుఁ డై యచిరాంసులతావిలాస చం
చల మగులక్ష్మి కాసపడి సత్యము ధర్మువుఁ దప్పి సత్సభా
వలిఁ దగువారియొద్దఁ దగు వాఁడయి సద్విధి నుండ నేర్చునే. 259

వ. ఏ నెట్లును సత్యసమయం బతిక్రమింప నోప [4]శుభోదయకాలంబుఁ బ్రతీక్షించి
యుండుము రాజ్యంబులుఁ బుత్త్రులును ధనంబును యశంబును సత్యంబునకు
సమంబులు గా వని భీమసేనుం డి ట్లనియె. 260

ఆ. అంతకుండు జనుల కాసన్నుఁ డై యుండ, నిమిషమాత్ర మేని నిశ్చయింపఁ
దగనిజీవితంబు దద్ద సుస్థిరముగాఁ, జేసి కార్య మెడయుఁ జేయఁ దగునె. 261

వ. శరీరికి మరణంబు నియతంబు మరణంబునకు ముందర వైరంబు దీర్పనివాని
జన్మంబు నిరర్థకంబు సకలరాజసమక్షంబునం బరులచేత నట్లు మనపడినపరిభవం
బునకుం బ్రతీకారంబు సేయునంతకు రేయునుం బగలును నాహృదయంబు దపిం
చు చుండు నాకంటె నర్జుననకులసహదేవులుం గుంతీదేవియు నంతస్తాపంబున
నెంతయు సంతప్తు లగుచున్నవారు. 262

క. వీరలదుఃఖము దీర్పక, [5]కూ్రరనికారు లగు రిపులకును ముదముగను
గా్రరణ్యములో ధర్మువుఁ, గారుణ్యముఁ దాల్చి యునికి కార్యమె నీకున్. 263

వ. ఇది బ్రాహ్మణధర్మంబుగాని క్షత్త్రియధర్మంబు గాదు మనుప్రణీతంబు లైనరాజ
ధర్మంబులు నీ వెఱుంగనియవి లేవు [6]శత్త్రుసంహారంబు సేయనినాఁ డత్యంత
హానియగు నట్లుం గాక. 264

తే. వనమునందుఁ బండ్రెండుసంవత్సరంబు, లుండ నేర్చితి మేనియు నొరు లెఱుంగ
[7]కుండ నజ్ఞాతచర్యయందొక్కదివస, మైన నుండఁగ నేర మెట్లనిన వినుము. 265

1 నీతియుతం బభీష్టసి, ద్ధ్యావహ...నీవు దలంపఁగా...రావసరోక్తికిం విషమ మై. 2 జరుపఁ బూని. 3 రాగరోషమా...యక్షమా వివశుఁ డై...సంచల యగు...సజ్జను డుండ. 4 సుఖోదయకాలంబుఁ. 5 క్రూరాకారు లగు రిపులకును ముదముగను...మనకున్. 6 శత్రుసంహార నిరసనంబున; శత్రువర్ధనంబున నత్యంతహాని. 7 ఘనండనజ్ఞాత వత్సర మొక్కదివస...మె ట్లయిన మనము.

వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండ వై పార్థివసూర్యుండ వై ననిన్నును సింహసదృశు లై ననీ
తమ్ములను నెఱుఁగనివారు లేరు మనగూఢభావంబు మేరువునిగూఢభావంబునుం
బోలె నఘటమానం బిట్లని నివ్వనవాసక్లేశం బెన్నఁడును మనకుఁ బాయ నే
రదు మన మిప్పు డివ్వనమునఁ బదుమూఁడుమాసంబులు సలిపితిమి సంవత్సర
ప్రతినిధిగా మాసంబులు సేసికొనుట యెందునుం గలయదియ దీన ధర్మవిరో
ధంబులేదు విజయారంభంబున కిది యవసరం బనిన భీమసేనుపలుకులు విని
[1]నిశ్వాసవ్యాకులితముఖుం డై పెద్దయుంబ్రొద్దు చింతించి ధర్మరా జిట్లనియె. 266

క. క్రమమునఁ బాండిత్య పరా, క్రమ[2]గర్వములందుఁ గడుఁ బ్రగల్భుండవు మ
ధ్యమ నీచెప్పినయది కా, ర్యమ యయినను ధీరబుద్ధి వై విను మనఘా. 267

వ. [3]అల్పీయం బైనకార్యంబు సాహసారబ్ధం బైనను దోషంబు లే దిది మహా
కార్యంబు సాహసక్రియాసాధ్యంబు గాదు సువిచారితం బైసిద్ధిం బొందు
విచార పూర్వారబ్ధకార్యంబునకు దైవంబును ననుకూలం బగుం గావున ని
మ్మగా విచారింప వలయు. 268

సీ. శూరులు[4]ధృతరాష్ట్రిసుతులు దుర్యోధనా,దులుదురాధర్షు లందఱును మనకు
నాతతాయులు మఱి యంగభూవిభుఁడును, భూరిశ్రవుఁడు మద్రభూమిపతియు
నాదిగాఁ గలవీరు లవిజేయవిక్రము, లొలసి తత్సుహృదులై యున్నవారు
మనచేత జితులైన మనుజేశు లెల్లను, జని సుయోధనుచేత సత్కరింపఁ

ఆ. బడి కడంగి వానిప్రస్తవంబున నాజి, వేచి ప్రాణములను విడువ నున్న
వారు వార లెల్ల వసుధఁ బ్రసిద్ధులు, వినఁగ నస్త్రశస్త్ర విద్యలందు. 269

క. వినవయ్య కర్ణుగర్వం, బని నాతఁ డభేద్యకవచుఁ డగుటయు విలునే
ర్పును నతనిబాహువిక్రమ, మును దలఁచిననాఁడు గన్ను మూయదు నాకున్.

వ. మఱియు భీష్మద్రోణకృపాచార్యులు సము లయ్యును వారియొద్దన యున్నవారు
వార లపారదివ్యాస్త్రవిశారదులు వారల నోర్చికాని దుర్యోధను నిర్జింపం
బోలదని విచారించుసమయంబున. 271

కృష్ణద్వైపాయనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట.

క. వారలపుణ్యోదయమున, వారిజభవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు ధర్మశ, రీరుఁడు [5]గృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్. 272

వ. ఇట్లు వచ్చి పరమభక్తిపరు లైనపాండవులచేతం బూజితుం డై కృష్ణద్వైపాయ
నుండు ధర్మరాజున కిట్లనియె. 273

---

1 నిశ్వాసవ్యాకులిత మానసుం డై ముఖంబున వివర్ణంబుదోపఁ జిన్నంబోయి పెద్దయుం.
2 గుణసంపదలఁ గడుఁ. 3 అల్పోపాయం. 4 ధృతరాష్ట్రిసుతులు సుయోధనా, దులు దద్దరిపుల
యందఱును మనకు ; ధృతరాష్ట్రిసుతులు సుయోధనా, దులు దురాధర్షు లుద్ధరులు మనకు, నాపగే
యుండును నంగరాజును. 5 గృష్టాజినోత్తరీయుం డంతట,

క. వీరు లగుభీష్మకుంభజ, శారద్వతకర్ణు లమిత సత్త్వులు వారిం
బోర వధియించు టెంతయు, భారం బని యున్న నీదు [1]భర మెఱిఁగి మదిన్.
ఆ. దాని నపనయింపఁగా [2]నిష్టు వచ్చితి, నధిక యోగలబ్ధ మతిరహస్య
మీవిశేషవిద్య సేవింపఁగాఁ బార్థుఁ, బనుపు మితఁడుఁ దీనఁ బడయు సిద్ధి. 275
వ. అని ధర్మతనయు నేకాంతప్రదేశంబునకుం దోడ్కొని చని సత్యవతీసుతుండు విధిదృష్టవిధానంబునం బ్రతిస్మృతి యనువిద్య నుపదేశించి దీనిశక్తి నర్జునుం డధిక తపోవీర్యవిభవుండై యింద్రయమవరుణకుబేరాది దేవతలను నీశ్వరునిఁ బ్రత్యక్షంబు సేసికొని వారలవలన దివ్యాస్త్రంబులు వడసి శత్రువుల జయించు మఱి యివ్వనంబు భవచ్చిరనివాసంబునం జేసి విరళఫలకుసుమపాదపం బై మృగకులోపరోధియై యొప్పకున్నయది యొక్కచోటన పెద్దకాలం బునికి యెవ్వరికిం బ్రీతిజననంబు గాదు కావున నొండువనంబున కరుగునది యని చెప్పి యమ్మునివరుం డరిగినఁ దద్వాక్యముదితులై ద్వైతవనంబు వాసి పాండవులు బ్రాహ్మణవరులతోన కామ్యకవనంబున కరిగి సరస్వతీతీరంబునందు నివాసంబు సేసి కొండొకకాలం బుండ నొక్కనాఁ డజాతశత్రుం డర్జునుఁ జూచి యిట్లనియె. 276
క. సాదితశాత్రవు లగుభీ, ష్మాదులయం దధిగతాశ్రయం బయ్యెఁ [3]జతుః
పాదం బగు చున్నధను, ర్వేదము బ్రాహ్మణులయందు వేదమపోలెన్. 277
వ. [4]అయ్యది మహనీయం బయి దివ్యమంత్రకలితం బయి వారలకు సన్నిహితం బగుఁ గావున. 278
క. వారలు దుర్యోధనుచే, నారాధితు [5]లిష్టసత్క్రియులు సల్పరణ
ప్రారంభ మయిన నెదిరెదు, వారు పరాక్రాంతులై యవశ్యము మనతోన్.
వ. దివ్యాస్త్రవిదులైనవారల నోర్చునట్టియుపాయంబు కృష్ణద్వైపాయనుండు ప్రసాదించి చెప్పె నీవిద్య నీవు ప్రతిగ్రహించి కవచకార్ముకప్రాసఖడ్గధరుండ వై యన్యులక జేయుండ వై యుత్తరదిక్కున కరిగి తపోయోగబలంబున నింద్రుఁ బ్రత్యక్షంబు సేయుము తొల్లి వృత్రునకు వెఱచి వేల్పులు తమయాయుధంబులు నింద్రునందు సమర్పించి రవి యెల్ల నీకుఁ దత్ప్రసాదంబున నగు మఱి యింద్రునుపదేశంబున నీశ్వరు నారాధించి తదనుగ్రహంబున నిష్టసిద్ధి వడయు మిది వేదవ్యాసునుపదేశం బని. 280
క. [6]ధృతినియమవ్రతునకు దీ, క్షితునకుఁ బార్థునకు విగతకిల్బిషునకు ధ
ర్మతనూజుఁడు ప్రీతిఁ బ్రతి, స్మృతి నుపదేశించెఁ దా నమిత్రజిగీషన్. 281
వ. అర్జునుండును నయ్యోగవిద్యాగ్రహణప్రభావంబున నధికతేజోమూర్తి యై

1 భయ మెఱిఁగి. 2 నిఁటవచ్చితి. 3 జతుష్పాదం 4 అయ్యది కలితంబయి వశీకృతంబయి (ఈవచనము కొన్నిప్రతులలో కానఁబడదు.) 5 లిష్ట సత్క్రియుల సత్వరణ; లిష్టసత్క్రియల నల్పరణ ప్రారంభు, లైన నెదిరెదు...వారపరాక్రాంతులయి యవశ్యము పోరన్. 6 ధృతినియత...వీతకిల్బి...దానమిత్రజిఘాంసన్; దగనమిత్రజిగీషన్.

దివ్యాస్త్రలాభార్థం బగ్రజుచేత ననుజ్ఞాతుం డై విధివిహితహోమసంతర్పితవీతి
హోత్రుండును బ్రాహ్మణకృతస్వస్త్యయనుండును నై ధౌమ్యాదిమహీసురవరు
లను భ్రాతృవరులను వీడ్కొని తపంబున కరుగ సమకట్టిన. 282

సీ. ఆతని గాండీవహస్తు నక్షయబాణ, తూణీరయుగళు నుత్తుంగభుజునిఁ
[1]కనకవర్మావృత ఘనతరతనుఁ జూచి, పొంగి యంతర్హిత భూతములును
బ్రాహ్మణప్రవరులుఁ బార్థునిమనమునఁ, దలఁచినయర్థంబు దడయ కిష్ట
సంసిద్ధి యయ్యెడు సర్వవిఘ్నములును, శాంతిఁ బొందెడు మని సంతసమునఁ
ఆ. బలికి రంతఁ దరుణి పాంచాలి బీభత్సు, కడకు నరుగుదెంచి కమలనేత్ర
యరిజయార్థ మరుగు నాతనియుత్సాహ, మెఱిఁగి యిట్టు లనియె నిందువదన.
క. [2]అవమానాసహ మగునీ, యవమక్షత్రియకులంబు నం దిం కిట పు
ట్టువు గా కుండెడు సత్క్షమ, మవుబ్రాహ్మణకులమునంద యయ్యెడు నాకున్.
చ. అరికృతదుష్పరాభవమహార్ణవమగ్నుల మమ్ము నందఱం
గరుణ సముద్ధరింపుము జగన్నుత యన్యులు పూనఁ గానియీ
భరము వహింపఁ బూనిన యపార[3]గుణాన్వితు నిన్ను దిక్కులున్
ధరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాడ్పును గాచు చుండెడున్. 285
వ. అని దీవించి పాంచాలరాజపుత్త్రి దనస్నేహాలాలసవిలోలాపాంగవిలోకనం
బులం బార్థుఁ [4]బరిగృహీతపాథేయుం జేయుచుఁ దద్వియోగతరళం బైనహృ
దయం బెట్టకేనియు నొక్కింత సేసికొని యుండె మఱి పార్థుండునుం బూర్వో
త్తరదిశాభిముఖుం డై యొక్కరుండ యరిగి యైంద్రయోగశక్తి నిఖిలభూతదు
ర్నిరీక్ష్యుం డగుచు హిమశైలగంధమాదనంబుల నతిక్రమించి. 286
ఉ. వీరుఁడు యోగవిద్యయును విల్లును దోడుగ నింద్రకీల మన్
[5]భూరినగంబుపైఁ గడఁగి పోవఁగఁ బోయినఁ బోవ కుండు ము
గ్రారివిభేది నీ వనుమహామధురధ్వని వించె వానికిన్
బోరన నంతరిక్షమునఁ బొల్చె నిరంతరపుష్పవృష్టియున్. 287
వ. దానికి విస్మయం బంది చనువాఁడు ముందట నొక్కవృక్షమూలంబున నున్నవృ
ద్ధబ్రాహ్మణు బ్రహ్మతేజోధికు నవిరతయమనియమకృశీభూతశరీరుం గని నమస్క
రించి తత్సమీపంబున విశ్రమించియున్న నప్పార్థుంజూచి బ్రాహ్మణుం డిట్లనియె.
క. ఎందుండి వచ్చి [6]తయ్యా య, నిందితతేజుఁడవు ధర్మనియతుండవు నీ
కిం దుండ నేల సిద్ధిం, బొందితి జేకొను మభీష్ట భూరిఫలంబుల్. 289
క. ఇది శాంతతపస్వుల కా, స్పద మిందుఁ గృపాణకవచబాణాసనసం

1 గనకవర్మావృతు ఘనతేజుఁ గనుఁగొని...బార్థనీమనమున...సంసిద్ధిఁ బొందెడు. 2 అవమానము వొందెడినీ, యవమ. 3 గుణోన్నతు. 4 పరిగృహీత సంతోషామృతపాథేయుం. 5 భూరినగంబునన్ నడచి...వీచె వానికిన్. 6 తన్న...పుణ్యఫలంబుల్.

పద దాల్చి యుండ నేటికి, విదితక్షత్త్రియకులుండ వే నీ వనఘా. 290

వ. వీతహర్షక్రోధు లైనబ్రాహ్మణు లుండెడు పుణ్యనివాసంబున నాయుధంబులు ధరియించి యుండ వలవదు వీని విడువు మని [1]నిషేధించిన నవ్విప్రవచనంబులకు సంచలింపక యున్నయాతనిధైర్యంబునకు మెచ్చి సహస్రాక్షుండు నిజరూపంబుఁ జూపి యతని కిట్లనియె. 291

ఆ. ఇష్టమైనవరము లిచ్చెదఁ బ్రీతితో, వేఁడు మనిన నమర విభున కపుఁడు
గరముభక్తిమ్రొక్కి కరములు మొగిచియి, ట్లనియెఁబురుషవృషభుఁ డర్జునుండు.

వ. దేవా నా కిష్టం బైనవరంబు భవత్ప్రసాదంబున దివ్యాస్త్రలాభం బనిన నది యేమిగహనంబు దానిన యిచ్చెదఁ బుణ్యలోకంబులు దేవత్వంబును సర్వకామంబులు వేఁడు మనిన నర్జునుం డిట్లనియె. 293

సీ. దివిజాధినాథ నా కవి యెల్ల నేటికిఁ, బరమాస్త్రలాభంబ కర మభీష్ట
మరులు సేసినమహా పరిభవక్లేశంబు, వాపంగ నోపక యేపుటడవి
నురుదుఃఖితుల సహోదరుల నందఱఁ బెట్టి, చనుదెంచి మిన్నక చనిన నన్నుఁ
దగువారు జగములోఁ దెగడగే నావుడు, సుతునకుఁ బ్రీతుఁడై శతమఖుండు

ఆ. గరుణ నిట్టు లనియెఁ బరమాస్త్రలాభంబు, నీకు నిష్టమేని లోకవంద్యు
గరళకంఠు నీశుఁ బరముఁ బ్రసన్నుఁగాఁ, వేగ చేయు మధిక యోగశక్తి. 294

వ. అట్లనిన నిఖిలలోకపాలసహితుం డై యీశ్వరుండు నీయభిమతం బొనరించు నని సహస్రలోచనుండు లోచనాగోచరుం డైన నర్జునుండును దద్వచనంబున సమాహితచిత్తుం డై హిమశైలశిఖరంబున కరిగి వివిధకుసుమఫలవృక్షంబులను విమల నిర్ఝరజలంబులను గమలకుముదకల్హారకలహంససంకులపంకజాకరంబులనురమ్యం బైనతపోవనంబునందుఁ బరమేశ్వరు నుద్దేశించి తపంబు సేయం దొడంగిన. 295

క. సురదుందుభినాదంబులు, సురపాదపసంభవప్రసూనసుగంధో
[2]త్కరవాహితపవనము వి, స్తరిల్లె నాతనికి హృదయసమ్మద మెసఁగన్. 296

వ. అందు మనోవాక్కాయకర్మనియతుం డై పరమేశ్వరుం దనచిత్తంబున నిలిపి నిరంతరత్రిరాత్రోపవాసంబుల నొక్కమాసంబుఁ జలిపి ద్విగుణితత్రిరాత్రోపవాసంబుల రెండవమాసంబుఁ జలిపి పక్షోపవాసంబుల మూఁడవమాసంబు సలిపి యూర్ధ్వబాహుం డై యేకపాదాంగుష్ఠాగ్రంబున నిలిచి వాయుభోజనంబు సేయుచు నాలవమాసంబు సలిపి యిట్లతిఘోరతపంబు సేయు చున్నయర్జునుం జూచి యందలిఋషులు విస్మయంబంది యీశ్వరుపాలికింజని యిట్లనిరి.

ఉ. భూరిబలుండు పాండవుఁ డపూర్వతపం బొనరించుటం దదీ
యోరుతపఃప్రభావ[3]దహనోత్థితధూమచయంబు లంబుదా

1 నిషేధించిననవి విఘ్నువచనంబులని చలింపక ; బోధించిన విఘ్నువచనం. 2 త్కరవాహి పవనములు విస్తరిల్లె; త్తరవాసితపవనము విస్తరిల్లె. 3 దహనోద్గత ధూమచయం.

కారము లై వనాంతరము గప్పె జగత్త్రియనాథ తత్తపో
భారము సర్వజీవుల కపారభయావహ మద్భుతం బిలన్. 298

వ. ఆతనియభిమతంబుఁ బ్రసాదించి తత్తపోభారంబు వారింపు మనిన వారలపలు
కులు విని పరమేశ్వరుండు దరహాసితవదనుం డగుచు వానియభిప్రాయం బే
నెఱుంగుదు నిష్టవరప్రసాదంబున వానికి మనఃప్రియంబుఁ జేసెద మీరు మీ
యాశ్రమంబుల కరిగి సుఖం బుండుం డని యప్పుడు. 299

ఈశ్వరుండు గిరాతవేషంబున నర్జునునొద్దకు వచ్చుట.

సీ. కాంచనవర్ణాపఘనుఁ డై మహోన్నత, కార్ముకహస్తుఁ డై కాలకంతుఁ
డెఱుకురా జయ్యె నదీంద్రతనూజయు, వనచరీభావంబు వఱలఁ దాల్చెఁ
గుఱుచచేతులు మిడిగ్రుడ్లునుగడుకొన్న,[1]తలటులు మఱిచెంచుఁదలలు నమరఁ
దడవిండ్లు సేపట్టి తడయక యెఱుకు లై, యార్చుచు భూతమ్ము లాత్మసతుల

తే. నెఱుకుసతులఁ గావించి యయ్యెఱుకురాజు
ముందటం బక్కియల నొక్క మొగిన నిలిచి
రంత వేఁటనెపంబున నంధకారి
గదలెఁ దద్వన మెల్ల గ్రిక్కిదలు చుండ. 300

చ. అలుగుల మంది యందులమృగావలియుఀ విహగంబులుఀ భయా
కులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీకులు నైనయట్లు లై
యులియక యున్నచో నడఁగి యుండఁ గిరాతబలంబుతోడఁ బిం
గలనయనుం డుమేశ్వరుఁడు గవ్వడి డాయఁగ వచ్చెఁ జెచ్చెరన్. 301

వ. అంత నీశ్వరచోదితుం డయి మూకుం డనుదైత్యుండు సూకరం బై భీకరా
కారంబున బీభత్సు వధియింప సమకట్టి పయిం బఱతెంచిన. 302

క. అనఘుండు దాని దవ్వులఁ, గని ఘనుఁ డయి పాండవుండు గాండీవగుణ
ధ్వని సేయుచు డాసినఁ బె, ల్చన యేయఁ గడంగి నిలిచె సంరంభమునన్. 303

వ. అదియును నాక్షణంబ యేసినయమ్మునుంబోలెనతివేగంబున దానాసన్నం బై నదా
నినేయ కేయకు మని యెఱుకురాజు వారించినను వానివచనం బాదరింపక. 304

చ. పటువిశిఖంబునం ద్రిదశపాలతనూజుఁడు పంది నేసె ము
న్నట పరమేశ్వరుండును రయంబున దానిన యేసె నిట్టు లా
[2]క్రోఁటఁ బడియెఀ హరార్జునుల ఘోరశరంబులు పందిపైఁ గుభృ
త్తటముపయిఀ వడిం బడు నుదగ్రమహాశనులట్ల మ్రోయుచున్. 305

క. హరుశరమును నరుశరమును, సరి నిరుపక్కియలు[3]దాఁకి జవ మఱి శరసం
భరమునఁ దిరిగెవరాహము, శరనిధిమథనమునఁ దిరుగు శైలముపోలెన్. 306

---

1 యుర్లును మఱి చెంచుఁ (చుంచు) (చింకి) దరముల(తలలు)(దరడుల) జడచుంచు(యంచు) దలలు నొప్ప; తలవఱ్లు; 2 క్కొట వడియెఀ...గాఢశరంబులు. 3 గొన్న.

వ. ఇట్లిద్దఱచేత శరవిద్ధుం డై మూకదైత్యుండు సూకరరూపంబు విడిచి నిజరూపంబుతోడ నదృశ్యుం డయ్యె నంత నర్జునుండు విస్మితుం డై ముందట నత్యున్నతచాపధరు మేరుశిఖరాకారు నపారకిరాతపదాతిసమేతు నభినవయౌవనవనచరీసహస్రపరివృతు నొక్కపురుషుం గని నీ వెవ్వండవు మనుష్యగోచరంబు గాని యివ్వనంబునఁ బ్రియవనితానుగతుండ వయి యేల క్రుమ్మరియెదు మఱి నాయేసినమృగంబు నేసి మృగయాధర్మవిరోధం బేల చేసితి నిన్ను నిప్పుడ నానిశితబాణజాలంబులపాలు సేసెద ననిన నగుచు నాతనికి నయ్యెఱుకురా జిట్లనియె.

ఆ. ఏను నామృగంబు నేసితి నది మదీ, యాస్త్రనిహత మయ్యె [1]నవికలముగఁ
జనునె నీకు లేనిశౌర్యసంపదఁ జెప్పి, [2]కొనఁగ మదము వలుకఁ గుజనునట్లు. 308

క. [3]పలుకుల నొప్పదు బీరము, గలవేని రణంబు సేయఁ గడఁగుము నీదో
ర్బల మిప్పుడ యుడిపెద నని, తలరక యేయుచుఁ బినాకి దాఁకెఁ గిరీటిన్.

వ. అంత. 310

చ. ప్రతిబలదర్పభంజనుఁడు పార్థుఁడు దారుణబాణవర్ష ము
న్నతి నతివీరుఁ డై కురిసినం బరముండు మహాంబువృష్టిఁ బ
ర్వతము [4]గ్రహించునట్లు బలవంతుఁడు దాని గ్రహించి పోర న
క్షతతనుఁ డయ్యె వాని నతిగర్వితుఁ బార్థుఁడు సూచి యాత్మలోన్. 311

చ. ఇతఁడు సురేంద్రుఁ డొండెఁ బరమేశ్వరుఁ డొండె దినేశుఁ డొండెఁ గా
కతులబలప్రభావయుతుఁ డన్యుఁడు గాఁ డొరుఁ డైన మద్భుజా
వితతధనుర్విముక్తశరవేగము పోర సహించి యిట్టు ల
క్షతుఁడు నమూర్ఛితుండు నయి కంపముఁ బొందక యుండ నేర్చునే. 312

వ. నాయేసినయపారదుర్వారనారాచంబు లవివేకియందుఁ బ్రయుక్తంబు లయిన సుభాషితంబులుంబోలె వీనియందు నిష్ఫలంబు లగు చున్నయవి. 313

ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన[5]శరములు, నెఱఁకులాడి నాకు నిశితదివ్య
విశిఖతతులయట్లు వేదన గావించు, టిది యపూర్వ మీతఁ డెవ్వఁ డొక్కొ.

వ. ఇప్పర్వతంబు దైవనివాసంబు గావున నితండు కిరాతరూపప్రచ్ఛన్నుం డైన యెవ్వనియొక్కొ దివ్యపురుషుండు గావలయు నని యశనికల్పంబు లయినదివ్యశరంబు లయ్యెఱుకుపయి నేసి యర్జునుం డక్షయబాణంబు లైనతనతూణీరమ్ముల యందమ్ములు గానక ఖాండవదహనంబునాఁ డగ్ని దేవుండు నా కిచ్చినయక్షయశరధు లిప్పుడు యుగాంతకాలరిక్తంబు లైనశరధులుంబోలె నున్నయవి యిది యేమియద్భుతంబో యనుచు నలిగి గాండీవం బెత్తికొని యెఱుకుపయింబఱచి.

---

1 నదినెపముగఁ; నదినెపమునఁ; నడరినదుమఁ. 2 కొనుచు. 3 పలుకులుసెప్పక బీరము, గలజేని రణ...దాఁకెం బెలుచన్. 4 గ్రసించునట్లు...గ్రసించి పోర...వాని నవికంపితుఁ బార్థుఁడు. 5 ములుకులు...వేదనగావించె, నిది యపూర్వ.

క. అపహృతగాండీవుఁడు నై, యపరిమితక్రోధహృదయుఁ డన్నరుఁడు పరం
తపుఁ డెఱుకుమస్తకంబునఁ, గృపాణపాతంబుఁ జేసెఁ [1]గిట్టి కడంకన్. 316

క. అదియు వృథ యైనఁ బార్థుఁడు, వదలక వృక్షముల రాల వైచెను రణదు
ర్మదు వనచరు నవి యెల్లం, దదంగముల నడఁగె నద్భుతంబుగ నంతన్. 317

క. హరుఁ బెనఁగి పట్టుకొని భీ, కరబలుఁ డర్జునుఁడు ముష్టిఘాతంబుల సం
గర మొనరించెను వనచర, వరు లాతనిశౌర్యగౌరవముఁ [2]బొగడ రెదన్. 318

క. తనదివ్యగాత్రమున న, ర్జును గాత్రనిపీడఁ జేసె శూలధరుం డం
తన మూర్ఛవోయి పీడిత, తనుఁ డై పార్థుండు ధరణితలమునఁ బడియెన్. 319

వ. అంత. 320

చ. వరదుఁడు పార్థశౌర్యవిభవంబున కాతని [3]ధైర్యవృత్తిక
ద్దరుదుగ మెచ్చి సన్నిహితుఁ డయ్యె జటామకుటేందురేఖయుం
గరమున శూలమున్ గరళకాలగళంబు బృహద్గజాజినాం
బరముఁ దృతీయలోచనముఁ బన్నగహారము నొప్పు చుండఁగన్. 321

వ. ఇట్లు విరూపాక్షుండు నిజరూపంబుతో నర్జునునకు సన్నిహితుండై అర్జునా! క్షత్త్రియులోరు లెవ్వరు నీయట్టిశౌర్యధైర్యవంతులు లేరు నీతపఃక్షాత్త్రగుణంబులకు మెచ్చితి నీకోర్కి సఫలంబు సేసెద సదేవాసురమానుషం బైనజగంబంతయు నీవ జయింతు నాస్వరూపంబు సూడు మని దివ్యదృష్టి యిచ్చినం జూచి పార్థుండు గృతార్థుం డయి దండప్రణామంబు సేసి. 322

క. వరదు సురాసురవందితుఁ, గరుణాకరు హరుఁ బినాకకరుఁ గరిచర్మాం
[4]బరు శంకరు గిరిజాసుం, దరు ని ట్లని సంస్తుతించెఁ దద్దయుభక్తిన్. 323

అర్జునుఁడు పరమేశ్వరుని స్తోత్రము సేయుట.

దండకము. శ్రీకంఠ లోకేశ లోకోద్భవస్థానసంహారకారీ పురారీ మురారిప్రియా చంద్రధారీ మహేంద్రాదిబృందారకానందసందోహసంధాయి పుణ్యస్వరూపా విరూపాక్ష దక్షాధ్వరధ్వంసకా దేవ నీదైనతత్త్వంబు భేదించి బుద్ధిం బ్రధానంబు గర్మంబు విజ్ఞాన మధ్యాత్మయోగంబు సర్వక్రియాకారణం బంచు నానాప్రకారంబులన్ బుద్ధిమంతుల్ విచారించుచున్ నిన్ను భావింతు రీశాన సర్వేశ్వరా శర్వ సర్వజ్ఞ సర్వాత్మకా నిర్వికల్పప్రభావా భవానీపతీ నీవు లోకత్రయీవర్తనంబున్ మహీవాయుఖాత్మాగ్నిసోమార్కతోయంబులంజేసి కావించి సంసారచక్రక్రియాయంత్రవాహుండ వై తాదిదేవా మహాదేవ నిత్యంబు నత్యంతయోగస్థితిన్ నిర్మలజ్ఞానదీపప్రభాజాలవిధ్వస్తనిస్సారసంసారమాయాంధకారు

1. గినిసి కడంకన్. 2. బొగడంగన్. 3 ధైర్యవృత్తికం దరుదుగ. 4 బరుగిరిజేశ్వరుఁ బన్నగ, ధరు ని ట్లని; బరు నీశ్వరుగిరిజా సుం, దరు ని ట్లని ప్రస్తుతించెఁ.

ల్ జితక్రోధరాగాదిదోషుల్ యతాత్ముల్ యతీంద్రుల్ భవత్పాదపంకేరుహ
ధ్యానడిండీరధారానుభూతిఁ సదాతృప్తులై నిత్యులైరవ్యయా భవ్యసేవ్యా భ
వాభర్గ భట్టారకా భార్గవాగస్త్యకుత్సాదినానామునిస్తోత్రదత్తావధానా లలాటే
క్షణోగ్రాగ్నిభస్మీకృతానంగ భస్మానులిప్తాంగ గంగాధరా నీప్రసాదంబునఁ సర్వ
గీర్వాణగంధర్వులుఁ సిద్ధసాధ్యోరగేంద్రాసురేంద్రాదులుఁ శాశ్వతైశ్వర్య
సంప్రాప్తులైరీశ్వరా విశ్వకర్తా సురాభ్యర్చితా నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు
కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః. 324

వ. అని యిట్లు స్తుతియించి కృతాంజలి యై కిరీటి వెండియు నిట్లనియె. 325

క. [1]ఎఱుకని యెఱుఁగక నీకుఁ, మఱకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం
గఱకంఠా క్షమియింపుము, నెఱి నెవ్వరి కెఱుఁగ నగునె నీచరితంబుల్. 326

వ. అనినయప్పార్థుం గరుణారసప్రీతివిస్తారితవిలోకనామృతమ్మున సంతర్పితుంజేసి నగుచు నీశ్వరుండు వానిచేయి వట్టుకొని ధనంజయా నీచేసినవ్యతిక్రమంబు క్షమియించితి నతిమానుషం బైననీపరాక్రమంబునకు మెచ్చితిఁ బూర్వజన్మంబున నీవు నరుండను దేవర్షివి నారాయణసఖుండవు నరనారాయణు లనంగా మీ రిద్దఱు బదరీవనంబున ననేకాయుతవర్షమ్ములు తపమ్ముఁ జేసినమహావీర్యవంతులరు మీ తేజంబున జగమ్ములు రక్షితమ్ము లగుచున్నయవి యిగ్గాండీవమ్ము దొల్లియు నీయదియ దీనన చేసి శక్రాభిషేకమ్మునాఁ డసురుల జయించి తదియిప్పు డక్షయశరధులతోడ మదీయమాయాగ్రస్తం బయ్యె నీగాండీవమ్మును నక్షయశరధులు నీ కిచ్చితిం గొను మింక నీకిష్టం బైనవరమ్ము వేఁడు మిచ్చెద ననిన నర్జునుం డిట్లనియె. 327

క. త్ర్యంబక నాకు నభీష్టవ, రంబుఁ బ్రసాదించెదేని రౌద్రము దివ్యా
స్త్రంబు బనఁ బరఁగినపాశుప, తంబుఁ బ్రసాదింపు మిందుధర దయతోడన్. 328

వ. ఇదియును బ్రహ్మశిరం బనునస్త్రంబును యుగాంత్యకాలంబునందుఁ బ్రయుక్తమ్ములై జగత్సంహారమ్ము సేయు దీనివలన నభిమంత్రితమ్ము లై యనేకశతసహస్రసంఖ్యల శూలంబులుగదలు నాశీవిషంబులయట్టియమ్ములు నుద్భవిల్లునని విందు నీకారుణ్యమ్మున దీనింబడసి దైత్యదానవ యక్షరాక్షసపిశాచోరగమ్ముల నతివీరులైనభీష్మద్రోణాదులను జయింతు సహజకవచకుండలుం డైనకర్ణుని వధియింతు ననిన నీశ్వరుండునుం గరుణించి విశుద్ధాత్ముం డైనపార్థునకు మంత్రధ్యానజపహోమపూర్వకంబుగా సంధానమోక్షణసంహారసహితంబుగాఁ బాశుపతాస్త్రం బిచ్చి దీనికి నసాధ్యం బెద్దియును లే దల్పులయందుఁ బ్రయుక్తం బైన జగత్సంహారము సేయు. 329

క. దీనివిధానం బెఱుఁగం, గా నింద్రకుబేరవరుణ కాలాదులకుం

1 ఎఱుకని యెఱుఁగక నిన్నుఁ.

దా నతిగహనం బనినను, మానవులకు నెఱుఁగు టఘట మానము గాదే. 330

వ. ఈ దివ్యబాణమ్మున నీ వఖిలలోకమ్ములు జయింతు వని కౌంతేయునకు వరం బిచ్చి పురాంతకుం డంతర్హితుం డయ్యె నంత. 331

చ. అవిరళ సూర్యమండల సహస్రసమప్రభ మై ధనంజయ
ప్రవరుకరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి దైత్యదా
నవసుర యక్షరాక్షస గణమ్ము గరమ్ము భయమ్ముఁ బొందె నం
దవనియు దద్దిరం దిరిగె నబ్ధిశిలోచ్చయ[1]సంచయంబుతోన్. 332

క. త్రిణయనగాత్రస్పర్శం, బున నిజగాత్రము పవిత్ర మును ముక్తాఘం
బును నతితేజోవీర్యం, బును నైనఁ బృథాసుతుండు ముదితుం డగుచున్. 333

క. మంటి హరుదేహ మంటం, గంటి నుమాధీశు [2]నసుర కంటకహాను ము
క్కంటిఁ గఱకంఠుఁ జూడం, గంటిఁ గృతార్థుండ నైతిఁ గడుఁ బుణ్యమునన్.

క. ఇమ్ముల ధర్మజునకు జన, సమ్మతునకు రిపుజయంబు సకలమహీరా
జ్యమ్ము సమకూరె నేఁడు ఘ, నమ్ముగ సర్వప్రయోజ నమ్ములతోడన్. 335

ఇంద్రుఁడు దేవగణంబులతో నర్జునునకుఁ బ్రత్యక్షం బగుట.

వ. అని సంతుష్టహృదయుం డై యున్నంత. 336

సీ. హరుచేత సంప్రాప్త వరుఁ డయ్యె నరుఁ డని, యెఱిఁగి యింద్రుండు ధ నేశధర్మ
వరుణేశ్వరులతోడ సురగణసహితుఁ డై, దివ్యవిమానముల్ [3]దివమునందు
వెలుఁగంగఁ గౌరవకులవీరుపాలికి, వరదుఁ డై గరుణతో వచ్చె నట్టి
యవసరమ్మున ఘన రవగభీరం బైన, మధురవాక్యమున ధర్మప్రభుండు

ఆ. ప్రీతి నిట్టు లనియె బీభత్సునకు ధర్మ, నిత్యపాండుపుత్త్ర నీకు మెచ్చి
వరము లిచ్చువేడ్క వచ్చిరి నెయ్యురై, యమరనాథుఁ దొట్టి యమరు లెల్ల.

వ. వీరలం జూడు మని దివ్యదృష్టి యిచ్చి నీవు నరుం డనుపూర్వఋషివి బ్రహ్మని యోగంబున మనుష్యుండవై యుత్తమక్షత్త్రియకులంబున నుద్భవిల్లితి మఱి సూర్యాంశజుం డైనకర్ణుని దేవదైత్యదానవగంధర్వయక్షరాక్షసాంశజు లైన రాజులను వధియింతు నీ కక్షయకీర్తి యగునని దండధరుం డప్రతివారణంబైన దండంబు విధియుక్తంబుగా నిచ్చిన. 338

క. ఘోరారి[4]దారుణము లగు, వారుణపాశంబు లిచ్చె వరుణుఁడు మఱి కౌ
బేరాస్త్రమిచ్చె నపుడు కు, బేరుఁడు విజయునకు నహిత భేదికిఁ బ్రీతిన్. 339

వ. ఇట్లు దివ్యపురుషుం డై నపార్థుండు లబ్ధదివ్యదృష్టి యై యమర్త్యరూపధరు లైనపితృదేవతలతోడం దనముందట నిలిచినమహానీలవర్ణుం డైనవైవస్వతుని వైడూర్యవర్ణుం డై యర్ణవనదీశైలసేవితుం డై నవరుణేశ్వరుం జాంబూనదవర్ణుం

1 సంయుతంబుగన్. 2 నమరకంటకుహరు. 3 దివినిబెక్కు. 4 వారణము లగు.

డై యక్షరాక్షసగణంబుతో నున్నకుబేరునిం జూచి వారివలన దివ్యాస్త్రం
బులు వడసి [1]వాక్పుష్పఫలజలంబుల నందఱం దృప్తులం జేసి వెండియు. 340

ఆ. అమరగణసమేతు [2]నైరావణారూఢు, వజ్రధరుఁ ద్రిలోకవంద్యు నింద్రు
వృత్రశత్రునమర విభుఁజూచి యెద నాది,మునివరుండు నరుఁడుముదమునొందె.

ఉ. ఇందుధరప్రసాదమున నిష్టవరంబులు గాంచి [3]బాంధవా
నందవిధాయి యైననిజనందను దండితశత్రు సద్గుణా
నందితుఁ జూచి వేడ్కనయనంబులు వేయును గన్న తత్ఫలం
బందెఁ బురందరుండు పర మాద్భుతసమ్మదమందితాత్ముఁడై 342

వ. ఇట్లు దేవేంద్రుండు ధనంజయుంజూచి సంతోసిల్లి నీవు పరమేశ్వరువలనఁ బరమ
సిద్ధితో దేవత్వంబు వడసితివి దేవకార్యంబు దీర్ప నర్హుండవు గాన నారథంబుఁ
బుత్తెంచెద నమరావతికి రమ్ము నీకు దివ్యాస్త్రంబు లందయిచ్చెద నని దేవేం
ద్రుండు దేవగణంబులతో నమరావతికి నరిగె నర్జునుండును దద్రథాగమనంబు
ప్రతీక్షించుచుండునంత. 343

సీ. [4]వారిదమార్గంబు వలన మహానీల, వైజయంతీవిభవంబు వెలయ
నాబద్ధవివిధరత్నావళిప్రభఁజేసి, రమ్యమై రోదోంతరంబు వెలుఁగ
నురునేమిరవమున నుర్వరాధరదరీ, ముఖములుప్రతిశబ్ద ముఖరితంబు
లగు చుండ నానావిధాయుధంబులు దాల్చి, యశనివిద్యుత్సహస్రాభిశోభి

ఆ. తాభ్రసదృశమై మహాజవాశ్వాయుత, వాహ్యమాన మైనవరరథంబు
మఘవునాజ్ఞఁజేసి మాతలియు క్తమై, యింద్రతనయుఁ డున్నయెడకు వచ్చె.

వ. మాతలియు నర్జునుం జూచి సురాసురకిరీటతటఘటితరత్నప్రభాభాసురపదుం డై
నమహేంద్రుండు మీయయ్య భవద్దర్శనం బపేక్షించి నిన్ను నమరావతికి రాఁ
బనిచె రాజసూయాశ్వమేధశతంబులం జేసినవారికైనను దుర్లభం బీరథంబు దీని
నెక్కు మనిన నర్జునుండును గంగాస్నానపవిత్రీకృతగాత్రుండై దేవ ఋషి పితృ
తర్పణంబులఁ జేసి మాతలిప్రయుక్తం బైనయాదివ్యరథం బెక్కె. 345

—— అర్జునుఁ డమరావతికిఁ బోవుట. ——

చ. అలఘుతపస్సమాధినియతాత్ములకుం బహుపుణ్యలోకకాం
క్షులకు విశుద్ధమానసులకుం సతతంబును [5]నాశ్రియంబ వై
లలితనిలింపదంపతివిలాసవిహారమహోత్సవంబులుం
గలిగి వెలుంగురత్నమయకందరసుందర మందరాచలా. 346

1 వాక్పూజనల నందఱం. 2 నైరావతారూఢు...యెదనాది. 3 యాంచితా, (పాండవా) నంద(మనోజ్ఞుఁ డై) విధాయి యై...మర్దితశత్రు; నప్డుచూచి. 4 వరదివ్యమార్గంబు...మెఱయ...యశనివిద్యుత్సమాహాభిశోభి...కరము వేడ్క నరుని కడకు వచ్చె. 5 సంశ్రయంబ వై....మంద రాచలుఁడు.

వ. నీయందలిపుణ్యతీర్థంబులు[1] సేవించుచు గంగాంబుధ్యోతస్థలరుహవనస్పతిఫలం
బులుపయోగించుచు సుఖం బుండితి నమరావతికిం బోయి వచ్చెద నని మందర
నగంబు వీడ్కొని పురందరనందనుండు దేవపథంబున కరిగి. 347

సీ. పరమధర్మస్థితిఁ బ్రజఁ గాచి యేలిన, రాజర్షులకు నుగ్రరణమునందుఁ
బతుల ప్రస్తవమునఁ బ్రాణముల్ విడిచిన, వీరులకును యజ్ఞవిధులఁ జేసి
సురలను వసుమతీసురులను దనిపిన, ధర్మాత్ములకు మహాతాపసులకు
నిలయంబులై రమణీయంబు లగు[2] రమ్య, హర్మ్యవిమానసంహతులదాని
తే. సకలభువనంబులం గలసత్పురముల, కెల్ల నుపమానమై దహనేందురవుల
దీప్తి లేకున్నఁ దన దైనదివ్యదీప్తి, విస్తరంబున నెప్పుడు వెలుఁగుదాని. 348

వ. మఱియు ననాహితాగ్నులకు నతీర్థసేవకులకు ననృతవాదులకు వేదవిరుద్ధా
చారులకు రణపరాఙ్ముఖులకుఁ జొరనవిషయంబును, నతిగహ్వరంబును నైన
దాని నమరావతిఁ జొచ్చి తద్గోపురసమీపంబున ననవరతగండస్థలగళ దవిరళ
మదజలకుల్యాభిరామంబై, నిరంతర నిర్ఝరనీహారనగంబునుబోలె నొప్పుచు
న్నైరావతంబుఁ జూచుచు సురసిద్ధసాధ్యగణంబులతో విద్యాధరాప్సరో గంధ
ర్వకిన్నరగీయమానుండగుచు నభినవసౌభాగ్యవిరాజమానంబులగు నతిమనో
హరవైభవంబు మెఱసి చను నప్పుడు. 349

క. [3]సకలర్తుకుసుమసౌరభ, సుకుమారోద్యానతరుల నుడియుచుఁ బ్రియయో
త్సుకుఁడై పవనుఁడు పాండవు,నకునభిముఖుఁ డయ్యెఁ దన్మనఃప్రియ మెసఁగన్.

క. నరుఁడై నయాదిముని యని, హరిసుతుఁ డని హరిసహాయుఁ డని హరుచేతన్
వరములు వడసినవాఁడని, సుర లెల్లను వచ్చి పార్థుఁ జూచిరి ప్రీతిన్. 351

వ. అర్జునుండు నయ్యమరావతీవిభవంబు సూచి హర్షించుచు నప్సరోగీయమాన
[4]మంగళహితగీతావహితమానసుం డగుచు సిద్ధమునిగణాశీర్వాదంబులు సేకొ
నుచుం జని మాతలినిర్దేశంబున దివ్యరథావతీర్ణుం డై. 352

క. శతమఖునకు భువనావన, రతశీలున కఖిలదేవరాజర్షిసమ
న్వితునకు [5]వజ్రాభిహితో, న్నతపృథుభుజునకుఁ గృతప్రణాముం డయ్యెన్. 353

చ. అనిమిషనాథుఁడుం బ్రచలితాంగదతుంగభుజాయుగంబునం
దనయునిఁ గౌఁగిలించుకొని తత్క్షణజాతనితాంతసమ్మదం
బునఁ బులకాంకితాంగుఁ డయి మున్ను నిజాంకతలస్థుఁ జేసి య
త్యనఘు నిజాసనార్ధమున [6]నాదట నుంచెఁ గరంబు నెమ్మితోన్. 354

క. లీలైరావతకుంభా, స్ఫాలనకర్కశకరములఁ బలుమరును మరు

---

1 చ్యోతస్థలీరుహా...చూచి. 2 రత్న, హర్మ్య. 3 సకలర్తుసురభి కుసుమిత...నభిమతుఁ (గతుఁ) డయ్యె. 4 మంగళగీతమహితమానసుం డగుచు. 5 వజ్రాభీలో, న్నత. 6 నప్పుడనుంచెఁ గరంబు; నాతనినుంచెఁ గరంబు.

త్పాలకుఁ డంటుచు నుండె గు, ణాలంకృతుఁ డైనపార్థునంగముఁ బ్రీతిన్. 355
వ. ఇట్లధికవిలాసంబుతో సురవిలాసినీకరకలితచారుచామీకరదండచామరసమీ
రాలోలకుంతలుం డగుచు సురరాజుతో నేకాసనంబున నున్న యప్పార్థుం బాక
శాసనుశాసనంబున దేవగంధర్వసిద్ధవిద్యాధరు లతిప్రీతి [1]నర్చించి రంత. 356
తే. *(పాకశాసనుపనుపున, బార్థుఁ డొక్క, మణిమయంబైనమహనీయమందిరమున
నెలమి గంధర్వసంగీత హృద్యగోష్ఠి, నుండెఁ జెవులకు నుత్సవం బొందుచుండ.
వ. అంత సూర్యాస్తమయసమయంబునఁ జంద్రుం డుదయించి సాంద్రచంద్రికా
విలాసంబున దిగ్వనితల నలంకరించుచుండ నిలింపపతిపంపున సొంపార నూర్వశి
[2]యర్జునసంగమకాంక్షం జేసి చంద్రికాధవళదుకూలంబుగట్టి మృగమదకర్పూర
కుంకుమోన్మిశ్రితసుగంధం బలఁది వివిధసురభికుసుమవిసరంబులు ముడిచి మణి
మయభూషణాలంకృత యై నిలుకడ వడసిన క్రొమ్మెఱుంగుఁదీఁగయుంబోలె మణి
మయమంజీరఝుళంఝుళనినాదంబును గంకణఝుణఝుణత్కారంబును గటికలాప
కింకిణీక్రేంకారంబును మదనాజ్ఞా వాద్యఘోషంబునుంబోలె మ్రోయుచుండ
మందగమనంబునఁ బురందరనందనుమందిరంబున కరుగుదెంచిన నప్పురుష
సత్తముండు భయభక్తి సంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండప్రణామం
బునుం జేసి కరకమలంబులు మొగిచి యిట్లనియె. 358
క. ననుఁ బుత్త్రిస్నేహంబున, మనమున మన్నించి శుభసమగ్రునిఁ జేయం
జనుదెన్చితీవు ముదమున, జనయిత్రియెఁ గృతార్థజన్ముఁడ నైతిన్. 359
తే. అనిన నూర్వశి యిట్లను[3]నాత్మనేత్ర, మధుపము లతనిసౌందర్యమధువుగ్రోలు
చుండఁదమకంబుమీఱియనూనధర్మ, నిపుణుఁడగునర్జునునితోడ నెయ్యమొనర.
చ. అనుపమశౌర్య నీదుసముదగ్రగుణంబులు నారదాదిస
న్మునివరు లెల్లఁ జెప్పఁగఁ బ్రమోదమునన్ భవదీయసంగమం
బనిశముఁ గోరుచుం దగఁ బ్రియంబున వచ్చితి నేను గోరఁగా
నను [4]జనయిత్రి యంచు నొకనాయముఁ బల్కెదు వక్రభాషలన్. 362
తే. [5]నీకు తల్లినేని నిజము సెప్పుమ, యమరలోకంబు వేశ్యల మైనమాకు
నిట్టితగవులు నడవ వహీనబాహు, వీర్య యిచ్చట వావియే వెదకఁజనునె.
వ. ఈ లోకంబున వనితలుఁ బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతు రిచ్చటికిది యనిందితం
బైనయాచారంబు నీవును ద్రిదివంబునకు వచ్చినయప్పుడ దివ్యపురుషుండవు
గావున నామనోరథంబు సఫలంబుగా మందార[6]మంజులమంజరీమకరందపాన

---

1 నగ్గించి. * 357 వ పద్యము మొదలు 368 వచనము వఱ కొక్క తాళపత్రప్రతియందును, ఒక్క కాకితపుప్రతియందుమాత్రము గలదు. 2 సంగమాకాంక్షంజేసి 3 దనదునేత్ర, మధుపముల నతి సౌందర్య...యఖండధర్మ...నెయ్యమలర. 4 జనయిత్రియంచు. 5 నీకునేనాటితల్లిని...వావియు వెదకఁజనునె. 6 మంజరీమంజుల.

మత్తమధుకరగానమనోహరస్థలంబులను మేరుశైలకందరంబులను మందపవనంబులు గలనందనాదివనంబులయందును నితాంతకాంతవికసితకనకారవింద సమధికసౌరభసంవాసితమహానందకందంబులైన మందాకినీతీరమణిమయవేదికలయందును జంద్రికాసుందరంబులైనసికతాతలంబులను మఱియు నిర్జరవిహారస్థానంబుల ననవరతసురతకేళీసౌఖ్యాంబుధి నోలలార్పు మనిన[1]నిర్వికారధైర్యధుర్యుం డై యర్జునుం డి ట్లనియె. 363

క. ఓహో యిమ్మెయి ధర్మ, ద్రోహోక్తులు వలుకఁ దగునె దోసం బది గా
దే హరి హరి మనమునఁ దగ, వూహింపక నన్నుఁ బలుకు టుచితమె నీకున్.

ఊర్వశి యర్జును నపుంసకునిఁగా శపించుట.

వ. జగంబులు వుట్టింపను మనుపను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గులేదు నేను గర్భభూమిని జనియించి కర్మఠుండ నైతి నాకు [2]నిచ్చటి యాచారం బుచితంబు గాదు మదీయవంశకర్తయైనపురూరవునకుఁ బత్నివైన కారణంబునను బురందరునకుఁ బరిచర్య యొనర్చుటను నాకు జనని వగుట సందియంబు లేదు తల్లీ నన్నుం బుత్త్రివాత్సల్యంబునం జూడు మనిన మదనబాణపీడిత యై కోపారుణితనయనంబుల నర్జునుం జూచి యూర్వశి యేను గామించి వచ్చిన నామనోరథంబు విఫలంబుఁ జేసినవాఁడవు నీవు మర్త్యలోకంబున మానవర్జితుండ వై మానినీమధ్యంబున నపుంసకుండ వై యుండుమని శాపం బిచ్చి నిజగృహంబునకుఁ జనియె నంతఁ బ్రభాతసమయంబునఁ దద్వృత్తాంతం బంతయు విని సురపతి కొడుకున కి ట్లనియె. 365

క. నీయట్టి ధైర్యవంతుని, నేయుగముల నైనఁ గాన మెన్నండును ధ
ర్మాయత్తమతివి మునులకు, నీయింద్రియజయము గీర్తనీయము తండ్రీ. 366

తే. అనఘ యూర్వశి యిచ్చినయట్టిశాప, మనుభవింపంగవలయు నీ కవనియందు
నింక మీాపదుమూఁడవయేఁడు సత్య, సరణి నజ్ఞాతవాసంబు సలుపవలయు.

వ. అక్కాలంబున నీవు షండరూపంబునఁ బ్రచ్ఛన్నుండవై రాజకన్యకలకు నృత్యంబు గఱపుచుండి తదంత్యంబున శాపమోక్షంబు వడయు మని యనుగ్రహించె నీయాఖ్యానంబు విన్నపుణ్యపురుషులు సకలదురితవిముక్తు లగుదురని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె.) * 368

సీ. వజ్రాస్త్ర మాదిగా [3]వరదుఁడై వివిధది, వ్యాస్త్రముల్ పార్థున కమర నిచ్చి
తత్ప్రయోగంబులుఁ దద్రహస్యంబులుఁ, దన్నివర్తనములుఁ దడయ కపుడు
దయ నుపదేశించి దారుణాహవములం, దవిజేయవీర్యుండ వగుము పేర్మి
నని మహాసౌహార్దుఁ డై చిత్రసేనుఁ డ, గ్గంధర్వపతితోడ గారవమున

1 నిర్వికారధైర్యధుర్యుం డైన. 2 నిచ్చటనాచారం. 3 వరదుఁడు (వరదుండు) దివ్యాస్త్రములు పార్థునకు వేడ్క మొనయ నిచ్చి.

ఆ. వజ్రధరుఁడు గీతవాద్యనృత్యంబులు, గఱవఁ బంచెఁ బార్థుఁ గడఁగి యిట్టు
లమరనాథునొద్ద నర్జునుం డుండ నే, నేఁడు లరిగె నిట మహీతలమున. 369

వ. అంత నొక్కనాఁడు రోమశుం డనుమహాముని యింద్రునొద్దకు వచ్చి సురగణ
పూజితుం డై సురేంద్రుతో నేకాసనంబున నున్న యర్జునుం జూచియాశ్చర్యం
బంది యింద్రున కి ట్లనియె. 370

క. క్రోరి యనేకయుగంబు ల, పారతపోయుక్తులై నవారికిఁ బడయఁగా
దూరము నీసభ మఱి నీ, కారుణ్యం బింతకంటెఁ గడుద వ్వెందున్. 371

వ. [1]అట్టియందు నీతో నొక్కట నేకాసనం బెక్కి నీ రెండవమూర్తియుంబోలెనున్న
యిమ్మనుజుం డెందులవాఁ డెవ్వఁ డనిన నమ్మునీంద్రునకు దేవేంద్రుం డిట్లనియె.

క. నరుఁ డనుమహర్షి యీతఁడు, నరలోకమునందుఁ బుట్టె నాయంశమునన్
[2]గురుమతిఁ గొంతేయుఁడు భా, సురతేజుఁ డుపేంద్రసఖుఁడు సువ్వె మునీంద్రా.

తరలము. శివుఁడు వీనికిఁ బ్రీతుఁ డై దయ సేసెఁ బాశుపతాస్త్ర మీ
దివిజముఖ్యులతోడ నేనును దివ్యబాణము లిచ్చితిం
దివిరి యీతఁడు మత్ప్రియంబున దేవకార్యము దీర్పఁగా
సవినయస్థితి నున్నవాఁడు [3]నిజప్రతాపబలోన్నతిన్. 374

వ. మఱియు [4]వసుమతీఖాతగర్వితులై ననగరసుతులం దనదృష్టితీవ్రదహనంబునం
జేసి దహించినకపిలుం డనుమహాముని నారాయణుం డయ్యె నట్టినరనారాయ
ణులాదిమునులు జగదుపకారులు జగతీభారావతరణ కారణు లై దైత్యదానవ
వధార్థంబు మర్త్యంబునం బుట్టినవారు గావున. 375

క. దేవతలకు నపకారము, గావించినయున్నివాతకవచులఁ బాతా
ళావాసుల దానవుల మ, హావీరుఁడు వీఁ డభేద్యుఁ డై వధియించున్. 376

వ. అని తత్ప్రభావంబు సెప్పి యింద్రుండురోమశునకిట్లనియె మునీంద్రా నీవుమర్త్య
లోకంబునకుం బోయి ధర్మజుం గని యతనికిం దత్సహోదరులకు సంతోషంబు
గా నాయొద్దం బార్థుం డున్నకుశలవార్త యెఱింగించి భీష్మద్రోణకర్ణాదివీరుల
నోర్చునట్టిదివ్యాస్త్రంబులు వడసె నతండు మీయొద్దకు వేగంబ వచ్చు వగవ
కుండుం డని చెప్పి నావచనంబున ధర్మజునకఖిలతీర్థసేవ సేయం బంపు మ ట్లయి
న నపేతదురితుం డై యఖిలమహీరాజ్యంబు వడయునతండు తీర్థాభిగమనంబు
సేయునపుడు నీ వాతనికి సహాయుండవు గ మ్మని యింద్రుండు రోమశుం బనిచె
నిట ధృతరాష్ట్రుం డర్జునుదివ్యాస్త్రలాభంబుఁ బారాశర్యు వలన నెఱింగి
పరమవ్యాకులహృదయుండై సంజయున కి ట్లనియె. 377

1 ఇట్టియందు నొక్కట యాసనం బెక్కి. 2 స్థిరమతిఁ; గురుపతిఁ. 3 జగత్ప్రతాపసము
న్నతిన్. 4 వసుమతీ ఖననగర్వితు లై...కారణావతారు లై.

సీ. సురసమూహంబుతో సురరాజు నోడించి, ఖాండవం బెక్కటి గాల్చి యున్న
వీరున [1]కఖిలాబ్ధివృతవసుంధరఁ గల, రాజుల నోర్చి పరాక్రమమున
నగ్రజు రాజసూయాధ్వర మనిచిన, యధికసమర్థున కర్జునునకుఁ
[2]బార్థసింహమునకుఁ బక్కెరవెట్టిన, యట్లు దేవతలు నెయ్యంబుతోడఁ
ఆ. బరముఁదొట్టి పాశుపత మాదిగా దివ్య, శరము లిచ్చి రట్టి శౌర్య మెసఁగ
నట్టినరుఁడు యోధుఁ డై యున్న పాండవ, వరులఁ జెనయునంతవారుఁ గలరె.
క. వారికి ధర్మువు దప్పని, వారికి [3]దృఢవచను లైనవారికి విమలా
చారుల కెద్దియుఁ బడయఁగ, దూరమె పాండవులఁ బోలుదురె వీరులోరుల్.
వ. వారలతో విగ్రహించి దుర్యోధనుండు దనకుఁ దనబాంధవులకు సుహృజ్జనంబు
లకు హాని సేసికొనియె. 380
ఆ. పర్వతములు వజ్ర [4]పాతాహతిని బోక, తక్కనేని నింద్రతనయుదివ్య
నిశితబాణతతుల నిశ్శేష మగు ననఁ, బరులసైన్యమెట్లు బ్రదుక నేర్చు. 381
వ. లయకాలోదితసహస్రకరుకిరణంబులం జరాచరంబులు దప్తంబు లగునట్లు పార్థ
బాణంబులం జేసి దుర్యోధనాదులు దుస్సహతాపంబుఁ బొందుదురని దుఃఖితుం
డైనధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. 382
క. ఈసున దుర్యోధన [5]దు, శ్శాసను లొగిఁ బాండవులకు సభలో నెగ్గుల్
సేసిన విని వారల నను, శాసింపఁగ వలవ దనఁగఁ జనదే నీకున్. 383
వ. నీయుపేక్షం జేసి దుర్యోధనదుర్ద్యూతపరాజితులై రాజ్యంబు విడిచి పాండవులరిగి
కామ్యకవనంబున నున్నఁ గృష్ణుం డనేకరాజసమన్వితుం డై వారియొద్దకు వచ్చి
నీకొడుకులు [6]సేసిననికారంబునకుం గృష్ణాపరిభవంబునకుదుఃఖితుం డై కడునలిగి
మీకు నిట్లు సేసినదుర్యోధనాదుల దూషించి గజపురంబున ధర్మరాజు రాజ్యా
భిషిక్తుం జేయుదు ననియు రాజసూయంబు సేయునాఁ డింద్రప్రస్థంబున నైనవిభూ
తికంటె విశేషవిభూతి గావింతు ననియు ద్రుపద సృంజయ కేకయ ధృష్టద్యుమ్న
బలదేవ సాంబ సాత్యకిప్రభృతులసమక్షంబునం బలికిసత్యసమయులైనపాండవుల
చేత సంరంభనివారితుం డై పార్థుసారథ్యంబునకుఁ బ్రార్థితుం డయ్యెనని వింటిమి.
క. పదుమూఁడేండ్లుం బోయినఁ, బదునాల్గగు నేఁడు ఘనులు పాండవులు జగ
ద్విదితముగ నుత్సహింతురు, వదలక రణమునకుఁ గేశవపురస్కృతులై. 385
క. [7]తిరముగ వేల్పులచే దు, ష్కరతపమునఁ బడయుదురు జగంబున నొరు లీ

1 కఖిలసద్వీపధరం గల; కఖిలాస్త్రవేదికిధరఁగల...రాజసూయాధ్వర మునిచిన. 2 ప్రబల సింహమునకు; ప్రౌఢసింహమునకు...నట్టినరుఁడజేయుఁ డై యుండఁ బాండవ, వరులఁ జెనయు నట్టివారుఁ. 3 ఋతు; మిత; హిత వచను లైనవారి. 4 పాతాభిహతివెర...గాక, పరులసైన్య మెట్లు బ్రతుకుబోర. 5 దుశ్శాసనులా పాండవులకు. 6 సేసిననిష్కారణవైరంబునకు. 7 వర ములు వేల్పుల.

శ్వరుచే వరములు వడసెం, గరుణ ధనంజయుఁడు దనదుకార్ముకశక్తిన్. 386

వ. అయ్యర్జునుదివ్యశరసంఘాతంబును భీమసేనుచిత్రగదాఘాతంబును నీయుపేక్షా
నిర్ఘాతంబును గౌరవపరిక్షయంబునకుఁ గారణభూతంబు లనిన సంజయునకు
ధృతరాష్ట్రుం డి ట్లనియె. 387

క. వృద్ధని జాత్యంధుం డని, బుద్ధివిహీనుఁ డని నన్నుఁ బుత్త్రుఁడు బలద
ర్పోద్ధతుఁ డై మెచ్చఁ డసం, బద్ధంబులె కాని వినఁడు పలికినపలుకుల్. 388

వ. దుర్యోధనుండు దుర్బుద్ధియని యేమి సెప్పవలయు భీష్మద్రోణవిదురాదుల నాద
రింపక కర్ణశకునుల నాప్తులం జేసికొని వారివచనంబుల నెగడు నే నేమి సేయుదు
నని ధృతరాష్ట్రుండు మిన్నకుండె నిట పాండవులు పార్థుమసలుటకు దుఃఖితు లై.

ఉ. పాండవసింహ మర్జునుఁడు పాండుయశంబు వెలుంగుచుండ నా
ఖండలుఁదొట్టి నిర్జరనికాయముచేత వరంబు గాంచి యె
న్నం డిట వచ్చునొక్కొ సుజనస్తుతు నాతనిఁ బ్రీతిఁ జూడ నె
న్నండొకొ కాంతు మంచును మనంబునఁ గోరుచునుండి రెంతయున్. 390

వ. అట్టియవసరంబున యుధిష్ఠిరునకు భీముం డి ట్లనియె. 391

మధ్యాక్కర. నీనిదేశంబున నరిగి పార్థుండు నిష్ఠతోఁ దపము
మానుగాఁ జేయుచు నున్నవాఁ డేల మసలెనో రాక
వాని [1]ధీరస్థితుఁ బాసి యున్నయివ్వర్షముల్ యుగస
మానంబు లై నవి మనకు నతనిసమాగమకాంక్ష. 392

వ. మఱి పాండవపాంచాలయాదవవీరులజీవనంబు లాతనియంద నిలిచినవి [2]తదీయ
భుజాశ్రయబలంబునం బరులజయించి ధరణీరాజ్యంబుఁ బరిగ్రహింతమని యున్న
వారము గావునం గాలయాపనంబు సేయక యర్జునుం దోడ్కొని తేర జనార్దను
రాఁ బనిచి నియోగింపుము. 393

మ. సమయాబ్దంబులకంటె ముందర మహోత్సాహంబునన్ బాహువి
క్రమ మొప్పన్ విజయుండు [3]నేను దగ సంగ్రామంబులో నేకకా
లమునం దాధృతరాష్ట్రజాధముల నెల్లం జంపి భూచక్రరా
జ్యము నేకొందుము కౌరవేంద్ర మురజిత్సఖ్యప్రసాదంబునన్. 394

---

1 ధర్మస్థిరుఁ. 2 'తదీయభుజాబలసంరంభంబునాశ్రయించి బలంబునం బరులజయించి సముద్రవేలావలయవలయితమహీచక్రంబున సకల ధరణీరాజ్యంబును' ఈవచనమునకు వెనుక కొన్నిప్రతులలో, చం. 'ఘనుఁడగుచున్నకృష్ణుఁడును గవ్వడియున్ వడిఁదోడ్పడంగఁ బేర్చినను సుయోధనాదులను జెచ్చెరసంగరభూమియందు జ్వలన్నవధియింతునాదుభుజకల్పితఘోర గదావిభూతి(విఘాత)మర్దననిజగాత్రపర్వతపరంపరలన్ గతభస్మమై జెడన్. వ. అని భీమసేనుండు విజృంభించి ధార్తరాష్ట్రుల తోడికయ్యంబునకు గాలుద్రవ్వుచు నంతకా కారుండై మఱియు ధర్మతనయు నవలోకించి యసాధారణవచనంబుల నిట్లనియె' ఈరెండు పద్యములున్నయవి. 3 నేను నయి సంగ్రామం.

తరతరుతతి కాప్యాయన, కరమై వర్షాగమంబు గడు బెడఁ గయ్యెన్. 134
క. నాలుగు[1]వలఁకుల నవఘన, జాలంబులు వ్రాలి కురిసె ఝంఝానిలవే
గాలోలము లై బహుళ, స్థూలపయోధార లోలిఁ దుములంబులుగాన్. 135
క. ఘనతరనైశతమం బొకొ, యనఁగ [2]ఘనాగమతమిస్ర మవికల మై క
ప్పిన జనులకు వస్తువిభా, వన మొక్కొకయెడల గలిగె వైద్యుతరుచులన్. 136
చ. [3]అరు దగుతత్పయోదసమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వలభూముల భూరిదర్దురో
త్కరరవముల్ మహీరుహశిఖాంతములందు శిఖండితాండవాం
తరమదమంజులస్వనము దా నతిరమ్యము లై వనంబునన్. 137
చ. దళితనవీనకందళకదంబకదంబకకేతకీరజో
మిళిత[4]సుగంధబంధురసమీరణుఁ డన్సఖుఁ డూఁచుచుండఁగా
నులియుచు మొల్లగుత్తు లనునుయ్యెల లొప్పఁగ నెక్కి యూఁగె ను
ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచున్. 138
క. సురచాపచిత్రగగన, [5]స్ఫురణం బురుణించునట్లు భూవనితనిరం
తరచిత్రితమై యొప్పెను, సురుచిరనవతృణశిలీంధ్రసురగోపములన్. 139
వ. తత్సమయానంతరంబున. 140
ఉ. భూసతికిం దివంబునకుఁ బో ల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకర మై విలసిల్లె మహర్షిమండలో
[6]పాసితరాజహంసగతిభాసిప్రసన్నసరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు నబ్జజయానముతోన్ సమాన మై. 141
ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశు [7]వికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరములం బరపూరితంబు లై. 142

నన్నయభట్టకవిత్వము సంపూర్ణము.

---

ఇక్కడనుండి యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వము.

చ. స్ఫురదరుణాంశు[8]రాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణము లై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ

---

1 గెలఁకుల. 2 ఘనాఘనతమిస్ర మవిరళ మై... మొక్కొకమాటు. 3 అరుదుగ... శిఖండములందు శిఖండి...ముదారతరం బగుచున్ వనంబునన్. 4 సుగంధిబంధుర. 5 స్ఫురణ విడంబించు. 6 ద్భాసిత. 7 విసార్యమాణ...పూరిత సర్వదిగంతరంబు లై; పూరములం బరిపూరితంబు లై. 8 రాగమునఁ బొంపిరి.

గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్. 143

శా. దానాంభఃపటలంబునం బృథుపయోధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నాఁ
గా నొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ వనాంతంబునన్. 144

క. కలనీలకంఠకోలా, [1]హలలీలలు సెలగె రాజహంసకులములం
దిలకించె సప్తపర్ణా, వలి విగళితకుసుమకుటజవాటికల గెడన్. 145

మ. అతిగాంభీర్యవిభూతి నేకచులికాహంకారనిశ్శేషశో
షితపాథోధిపయస్కుఁడైన మునిఁ దోఁచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీథిఁ బ్రకటక్రీడాకళాగర్వగ
ర్జితమండూకకళంకితాంబుశుచితా [2]సిద్ధిప్రదాచార్యుఁడై. 146

తే. విశదశారదాంబుదపరివేష్టనమునఁ, బొలుచుగగనంబు ప్రతిబింబమో యనంగ
వికచకాశ[3]వనీపరివేష్టనమున, నతిశయిల్లె నిర్మలకమలాకరములు. 147

వ. అట్టిశారదాగమంబున నుత్ఫుల్లకమలకల్హారకేసరకరాళకలితకల్లోలమాలినియు ననేకమునిలోకసతతసంసేవ్యమాన విపులపులినోత్సంగయు నిరంతరతీరవానీర వేతస వనమండలీవిలసితయు నాకాశసంకాశవిశదసలిలయు నైనమహాసరస్వతీ నది ననుదినస్నానపానాదివిశేషంబులం బరితోషంబు నొందుచుఁ బాండునం దను లమ్మరుభూమిం గొన్ని దినంబులు వసియించి తదనంతరంబ ధౌమ్యాది భూసురవరులు నింద్రసేనాదిమూలభృత్యులుఁ దోడ నరుగుదేరఁ గామ్యకవనం బునకు వచ్చి యచ్చటిమునులచేత నభినందితులై యందు సముచితవర్తనం బుల నుండునంత నొక్కనాఁడు. 148

క. వాసవనందనసఖుఁ డగు, భూసురుఁ డొకఁ డరుగుదెంచి భూవినుతగుణో
ద్భాసితు ధర్మజు విప్రస, భాసీనుం గాంచి యిట్టు లనియెం బ్రీతిన్. 149

చ. జనవర నీవుఁ దమ్ములును సమ్మద[4]మొందఁగ నివ్వనంబునం
దునికి ధ్రువంబుగా విని మహోజ్జ్వలతేజుఁడు దేవకీసుతుం
డనఘుఁడు మిమ్ముఁ జూచుటకునై యిట వచ్చుచు నున్నవాఁడు మీ
కును ననిశంబుఁ దా హితమకోరుచు నుండు నతండు నెయ్యుఁడై. 150

వ. మఱియు ననేకయుగసహస్రజీవియు నప్రమేయతపఃప్రభావభావియు వినుతవిధే యుండు నగుమార్కండేయుండును భవదీయదర్శనార్థం బీక్షణంబ చనుదెంచు నని చెప్పినయనంతరముహూర్తంబున. 151

---

1 హలలీలలు సెంచె...విగళితకుసుమగంధవైభవమొప్పన్ ; విగళితకుసుమకుంజవాటికలం దున్ ; వికసితకుసుమకూటవాటికలయెడన్. 2 సిద్ధప్రతాచార్యుఁ. 3 వనావలివేష్టనమున. 4 మొప్పఁగ...దునికి నిజంబుగా విని...మీకును నెపుడున్ హితంబు మదిఁ గోరుచు.

శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవులయొద్దకు వచ్చుట.

సీ. [1]సైన్యసుగ్రీవాదిజవనాశ్వయుక్తమై, యాబద్ధనూత్నరత్నాంశుపటల
భాసితంబై చారుపతగపతాకావి, భూషితగగనమై పొలుపు మిగులు
దివ్యరథంబున దేవకీసుతుఁడు ప్రి, యంబున సత్యభామాన్వితముగఁ
దరళసౌదామినీ దామసముజ్జ్వల, ధారాధరోత్సంగతలమునందు
ఆ. శచియుఁ దాను వెలుఁగుశతమన్యుఁడునుబోలె, నరుగుదెంచె ఘనరథాంగనేమి
విపులఘోషతాండవితబర్హిశబ్దశ, బ్దాయమానవనవిభాగుఁ డగుచు. 152
వ. ఇట్లు వచ్చి వాసుదేవుండు రథావతరణంబు సేసి ధర్మనందనున కభివందనం బాచ
రించి భీమార్జుననకులసహదేవులం గౌఁగిలించుకొని ద్రౌపదిగారవించి ధౌమ్యాది
మహీసురులచేత నభినందితుండయ్యె నంతఁ గౌంతేయాగ్రజుండు [2]గదాగ్రజునకు
నర్ఘ్యాదిసత్కారంబులు నిర్వర్తించి తమ్ములుం దానును విప్రజనంబులు నతనిం
బరివేష్టించి యుండె నప్పుడు కృష్ణుండు ధనంజయుం దనచేరువ నునిచికొని చిర
కాలదర్శనోల్లాసితంబులైన యాలోకనంబుల నతనియాకారం బత్యాదరంబున
నభినందించుచు ధర్మరాజున కిట్లనియె. 153
సీ. భాగ్యంబు గాదె యీపార్థుండు హరుఁ డాది, యైననిర్జరసమూహంబువలన
నెలమిఁ గృతాస్త్రుఁడై యేతెంచు టరయంగ, ధన్యుండవైతీవు ధర్మతనయ
నీధర్మనిష్ఠయు నీతపంబును జూవె, యింతకుఁ గారణం బిద్ధచరిత
రాజ్యంబుకంటెను రాజేంద్ర ధర్మంబ, యిష్టమై యుండు నీ కెల్లనాఁడు
తే. వేదవేదాంగవిదుఁడవు వివిధయజ్ఞ, కర్తవైతి ధనుర్వేదకర్మఠుఁడవు
ధరణి యెల్ల నేలెడిరాజధర్మ మమర, సులభ మయ్యె నీ కిహపరశోభనములు.
చ. దమమును సత్యయుక్తియును ధైర్యనిరూఢియు నిత్యతృప్తియున్
శమమును నీకు నైజములు సన్మతి నర్థవశంబుఁ గామలో
భములును బొంద వట్లగుటఁ బార్థివకుంజర ధర్మరాజనా
మమునఁ ద్రిలోకపూజ్యమహిమం బొగడొందెద [3]వెల్లకాలమున్. 155
వ. అని పలికి వెండియు. 156
శా. ద్యూతవ్యాజమునన్ సభాంగణములో దుర్యోధనుం డట్లు దు
ర్నీతిం [4]గూరి యొనర్చినట్టియఘముల్ నిష్కంపధైర్యోన్నతిన్
జేతఃస్ఫారుఁడవైన నీ కొకనికిం జెల్లెన్ సహింపంగ వి
ఖ్యాతక్షాంతులు లేరె ధార్మికులు నిక్కం బిట్టిరే యెవ్వరున్. 157
ఉ. ఉల్లము [5]సత్త్వసంశయము నొందినవాఁడవు నీవు విక్రమం

1 శైబ్యసుగ్రీ...పొలుపు మీఱు...శతమఖుండునుబోలె. 2 గరుడధ్వజునకు...దర్శనోల్లసితంబు. 3 వివిధంబునన్. 4 గ్రూరుఁ డొనర్చినట్టి... ధైర్యోన్నమ, చ్చేతస్స్ఫారుఁడ. 5 సత్యసంయమము నూనినవాఁడవు.

బొల్లమిఁ గౌరవాధముల[1]యుద్ధతి యమ్మెయిఁ జెల్లెఁ గాక యొం
డెల్లను నేల నీదుమది నించుకకిన్కఁ జనించినన్ మహీ
వల్లభ యప్డు రూపఱదె వారక వైరికులంబు సర్వమున్. 158

చ. వినుతభవ[2]న్నియోగ మను వేల యలంఘ్యము గాన యెమ్మెయిన్
ఘనభుజవీచివిభ్రమవికాసముఁ జూపక నిల్చెఁ గాక స
జ్జనసుత చూడ నీయనుజసాగరముల్ దఱితోడ విద్విష
జ్జనలయకాలులై కడఁగు సర్వజగంబులు నాక్రమింపఁగాన్. 159

ఉ. అంధకవృష్ణిభోజకుకురాన్వయభూపతు లెల్ల నీదెసన్
బాంధవసౌహృదప్రణయభక్తివిశేషము లొప్ప నీమనో
గ్రంధి యడంగఁ జేయ నెసకంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు జనాధిప మార్కొనువారె వారలన్. 160

క. చతురంభోధిపరీత, క్షితితలసామ్రాజ్యలక్ష్మికిం బతివి జగ
న్నుత [3]నీవ నీవు దలఁచిన, నతిదుష్కర మెందు లేదనర్గళమహిమన్. 161

వ. అనిన సంతోసిల్లి కుంతీనందనుండు దేవకీనందనుతోడ దేవా యెవ్విధంబున
నైననల్పావశిష్టం బైనయివ్వనవాసంబును నజ్ఞాతవర్తనంబును[4]దీర్చి లోకనింద్యం
బుగాని విక్రమంబునం బగఱ జయింపఁ గోరెదము దీని నంతయు నిర్వహించు
భారంబు నీయదియ నీశరణంబు సొచ్చినమాకుం బరమశోభనంబులును సుల
భంబు లగుట నిశ్చయంబు గాదె యనియె నప్పుడు కృష్ణుండు నిజసమీ
పంబున నున్నపాంచాలిం జూచి యిట్లనియె. 162

సీ. నీపుత్త్రు లేవురు నీరజలోచన, యదుకుమారులుఁ దారు ముదముతోడ
ననుపమస్నేహసమాహృతహృదయులై, కరిహయారోహణ[5]పరతఁ దగిలి
యాడుచు వివిధశస్త్రాస్త్రవిశేషముల్, గఱచుచు నొం డెల్ల మఱచి యున్న
వారు ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్ర, జాతంబు లెల్లను బ్రీతి నొసఁగఁ

ఆ. దన్వి యాసుభద్రతనపుత్త్రికంటె నీ, తనయులందుఁ గూర్మిఁ దనరఁ జేయు
నూఱడిల్లు మింక నుజ్జ్వలోన్నతులఁ బెం, పారఁ గాల మనతిదూర మయ్యె.

మార్కండేయుం డనుమహాముని పాండవులయొద్దకు వచ్చుట.

వ. అని యాశ్వాసించుసమయంబునం బరమతపోవృద్ధుం డయిన మార్కండేయుం
డు సనుదెంచినం గృష్ణుండును బాండవులు నతని నెదుర్కొని యథోక్తవిధులం
బూజించిరి మునీంద్రుండును వారిని బ్రత్యేకంబ కుశలంబు లడిగెఁ దదనంతరం
బ యందఱు నాసీనులై యున్నయెడఁ బాండవహితార్థియై వనజోదరుం

---

1 యుద్ధతి (యామెయిఁ) మై మెయిఁ. 2 న్నిదేశ...యిమ్మెయిన్... కాయలై కడఁగి సర్వజగంబుల నాక్ర (మింపఁగన్) మింపవే. 3 నీవ నీ తలంచిన...మొందు లే; నీ కవనితలంబున. 4 జలి...బరమశోభనంబు లగుట. 5 చరితఁ.

డమ్మునివరున కిట్లనియె. 164

ఉ. ఏనును బాండునందనులు నిమ్మునిముఖ్యులు నిష్ఠ లోకస
మ్మానితవాక్య నీ దయినమంజులవాగమృతప్రవాహముల్
వీనుల [1]దోయినించుచును వేడుకఁ గ్రోలికొనంగ నాత్మలం
బూనెద మస్మదీప్సితము పూర్ణము సేయఁగ నర్హ మెమ్మెయిన్. 165

వ. కావున. 166

క. దేవనరదేవధరణీ, దేవచరిత్రములు భర్తృదేవత [2]లన నా
భూవినుత లయినసతులప్ర, భావము లెఱిఁగింపు మోలిఁ బ్రస్ఫుటములుగాన్.

వ. అని యడుగు చున్నయెడ నారదుం డేఁగుదెంచిన నందఱు ప్రత్యుద్గతు లయి ప్రణమిల్లి యాతని నుచితపీఠంబున నునిచి యుచితసత్కారంబులం బ్రీతునిం జేసిన నమ్మహాముని మార్కండేయునిం జూచి కృష్ణపాండవప్రియహితార్థం బుగాఁ బరమపుణ్యకథాకథనం బొనరింతువు గాక యని పలికి వారల నామంత్రణంబు సేసి నిజేచ్ఛం జనియెఁ దదనంతరంబ ధర్మతనయుండు మార్కండేయున కిట్లనియె. 168

సీ. కడఁగి ధర్మముతోడ నడచుచు నే మిట్లు, దందడిదుఃఖంబు [3]లొందుటయును
నేపున నెప్పుడు పాపంబు సేయుచు, ధృతరాష్ట్రజులు సుఖోన్నతు లగుటయుఁ
గని యీవిపర్యయమునకు నే నూహింతుఁ, బాయక నరుఁ డిష్ట సేయుకర్మ
మునఫలమిందుబొందునొ పరలోకంబు,నందుఁబొందునొయిందునందుఁగనునొ

ఆ. విశ్వకర్త యైనయీశ్వరునిన కాని, పురుషుఁ గర్మఫలము పొరయ కున్నె
యొడలితోనఁ గృతమువెడలిపోవునొ యిది,దెలియవలయు నాకు నలఘుపుణ్య.

వ. ఇంతయు నెఱింగింప నీవ యర్హుండ వనినఁ బరమజ్ఞాననిధి యైనయత్తపోనిధి యతని కిట్లనియెఁ దొల్లి విధాతప్రథమకల్పంబున నత్యంతనిర్మలంబులును ధర్మతంత్రంబులు నైనశరీరంబులు సృజియించె నట్లు పుట్టింపఁబడినయామనుష్యులు మహాసత్త్వసంపన్నులు సత్యవాదులు సత్యసంకల్పులు బ్రహ్మభూతాత్ములు స్వచ్ఛందజీవులు నై దేవయానంబుల విహరించుచు ననాయాసంబున నధికఫలసిద్ధిం బొందుచు సర్వజ్ఞులై విగతమత్సరులై బహుసహస్రసంతానులై బహుసంవత్సరాయుష్యులై వర్తిల్లుచుండి రంతఁ గాలాంతరంబునం గామక్రోధాదిగుణంబులు దమ్ముం బొందుటయు మాయాప్రవర్తను లై దేవతలచేత విడువం బడి యల్పాయువులు నల్పబలశరీరసత్త్వులును దరిద్రులును నిష్ఫలారంభులును బహురోగపీడితులును నాస్తికులును నై యొండొరుల మెచ్చక దురితంబులు సేయుచుఁ దిర్యగ్యోనులం బుట్టుచు నరకాగ్నులం [4]గాగుచు గతాగతభ్రమ

1 దోయిలిఁచుచు. 2 లనఁగా. 3 (బొందుట...గని యవ్విపర్యయ...కర్మ, ఫలమిం దుఁబొందునో పరమందుఁబొందునో, యటుగాక యిందును నందుఁ గనునో. 4 వేల్చుచు.

ణంబులనలయం దొడంగి రిట్లు దిరుగుచున్నసంసారచక్రంబునందు. 170

చ. మనుజులు పుణ్యపాపములు మానక [1]యిట్లొనరించుచుం దుదిం
దనువు దొఱంగి పోవునెడఁ దప్పవు నీడయుఁబోలెఁ గర్మముల్
వెనుకన యేఁగి భూరిసుఖవిస్మృతియుం బటుదుఃఖదైన్యముం
దనుకఁగఁ జేయుఁ గ్రమ్మఱఁగఁ దాన యొనర్చు భవంబు దేహికిన్. 171

క. విను మనుజున కెవ్విధమునఁ, దనచేసినసుకృతదుష్కృతంబులు నెఱయం
దన కనుభవింపఁ బాలివి, తనువు సెడుం గాని కర్మతతి సెడ దనఘా. 172

వ. మఱియు [2]నున్ననిదర్శనంబులు సెప్పెద. 173

క. ఈలోకమ [3]యగుఁ గొందఱ, కాలోకమ గొందఱకు నిహంబును బరముల్
మే లగుఁ గొందఱ కధిపా, యేలోకము లేదు సూవె యిలఁ గొందఱకున్. 174

వ. అది యెట్లనిన. 175

చ. ధనములు సాలఁ గల్గి సతతంబును నింద్రియవాంఛ సల్పుచున్
మనమున నెన్నఁడున్ సుకృతమార్గముపొంతకుఁ బోక లోభమో
హనిహతబుద్ధులై తిరుగునట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్
గనుటకు నేర [4]రిక్కడి సుఖంబులు మే లయి తోఁచు వారికిన్. 176

మ. ఉపవాసవ్రతసంతతాధ్యయనతీర్థోపాసనాదిక్రియై
కపరత్వంబునఁ జేసి యైహికము దుఃఖప్రాయ మై పోవఁగా
విపులానందముఁ బొందఁ గల్గుఁ దుది నావిర్భూతభోగ్యైకలో
లుపబుద్ధిం జిరపుణ్యశీలురకు నాలోకంబునన్ భూవరా. 177

ఉ. ధర్మమ [5]సల్పుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థముం
బేర్మియుఁ గాంచి ధర్మవిధిఁ బెండిలి యై ప్రజలన్ సృజించి స
త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ దనరించు సజ్జనుల్
ధర్మజ యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్టసౌఖ్యముల్. 178

ఆ. సత్యమును శమంబు శౌచంబు లేక నా, స్తిక్యమును నిషిద్ధసేవనంబు
గలిగి [6]తిరుగుదుష్టకష్టజనశ్రేణి, పొలియు నుభయలోకములకుఁ గాక. 179

వ. ఇది మనుష్యులకర్మగతిప్రకారంబు. 180

చ. జననుత మీరు దివ్యులరు సమ్మతి దేవహితార్థ మిమ్మహిన్
జననము నొందినారరు ప్రశస్తపరాక్రమలీలఁ బేర్చి యిం
క నఖిలశత్రునిర్మథనకర్మ [7]మొనర్చి మహీభరంబు దీ
ర్చి నియతిఁ బెక్కుజన్మములు సేసి భజింతురు దేవభావమున్. 181

1 యిం దొనరించుచుం...విశ్రుతియుం. 2 నొక్కనిదర్శనంబు. 3 యురుఁ గొందఱ... లేదు వినవె యిలఁ. 4 రిప్పటి. 5 పల్కుచుం...బెండ్లియు నై...గ్రతువుల్ వొనరించు...రభీష్టసంపదల్. 6 తిరిగి దుష్ట. 7 ములం జయశీలవృత్తిఁ దీర్చి...దేవభావముల్.

మార్కండేయుఁడు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట.

వ. అనిన విని ధర్మనందనుండు బ్రాహ్మణప్రభావంబు విన వలతుం జెప్పవే యనిన మార్కండేయుం డిట్లనిచెప్పెఁ దొల్లి హైహయవంశోద్భవుం డైనధుంధుమారుం డనుపేరిరాజకుమారుండు మృగయాసక్తుం డై వనంబునఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడం దృణలతాగుల్మమధ్యంబునం గృష్ణాజినోత్తరీయుం డయి యున్న వాని నొకవిప్రు దవ్వులం గని మృగం బనుబుద్ధిం జేసి బాణంబేసి డాయంజని [1]నిజశరచ్ఛిన్నుం డయినయతనిం జూచి యత్యంతదుఃఖితుం డయి పురంబునకుం బోయి నిజవంశవృద్ధు లైనహైహయుల కంతవృత్తాంతంబునుం జెప్పి వారిం దోడ్కొని వచ్చి యవ్విప్రకళేబరంబు సూపిన. 182

తే. వార లందఱు వందురివగచియచటి, కతిసమీపంబునను దార్క్ష్యుఁ డనుమునీంద్రు
నాశ్రమం బున్న నయ్యెడ కరిగి కనిరి, దేవమునిసిద్ధలోకప్రతీక్ష్యుఁ దార్క్ష్యు.

క. కని భక్తి మ్రొక్కుటయు న, య్యనఘుఁడు దీవించి వారి కర్ఘ్యా మ్మగుపూ
జనము లొనరింపఁ బంచెం, దనశిష్యులఁ బరమ[2]సంశ్రితపరుండు దయన్. 184

వ. హైహయులు నమ్మునీంద్రునకు సాష్టాంగదండప్రణామంబులు సేసి మహాత్మా యిక్కుమారుండు మృగయాసక్తుం డై వచ్చి యింతకు మున్న యివ్వనంబున నొక్క బ్రాహ్మణుం గృష్ణాజినావృతు నతిశ్రాంతుం బాపంబునం జేసి మృగం బనుబుద్ధి నేసిన నతండు మృతుం డయ్యె నేము మహాపాతకదూషితుల మైతిమి గావున మీచేయుసత్కారంబుల కర్హులముగా మిప్పాపంబున కెయ్యది నిష్కృతి యనిన నవ్వచుఁ దార్క్ష్యుం డిట్లనియె. 185

క. వినుఁ డెన్నఁడు మాయాశ్రమ, మున నెవ్వారలకు లేవు భూరిభయవ్యా
ధినిరోధ మృత్యు[3]దోషా, ద్యనేకదుఃఖములు త్రిజగదాశ్చర్యముగన్. 186

వ. *అని పలికి దనపుత్త్రు నధికతపోబలసమన్వితుం జూపి. 187

క. ఈతఁ డగునె మీబాలకు, చేత నిహతుఁ డైనవాఁడు సెప్పుఁ డనుడు వా
రాతఁడ తమముచూచిన, యాతం డగుటకు మహాద్భుతాత్మకు లగుచున్.

క. మృతుఁ డయి క్రమ్మఱ సంజీ, వితుఁ డయ్యె నితండు కరము విస్మయ మిది భూ
నుత యిట్టిమహిమకలిమికిఁ, గత మెయ్యది యానతిమ్ము [4]కారుణ్యనిధీ. 189

వ. అని యడిగినఁ దార్క్ష్యుం డిట్లనియె. 190

శా. ఆలస్యం బొకయింత లేదు శుచి యాహారంబు నిత్యక్రియా
జాలం బేమఱ మర్చనీయు లతిథుల్ సత్యంబ పల్కుంబడుర్
మే లౌశాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు మ ట్లాట నె

1 నిశ్చేష్టతనుం డైన ; నిశ్చేతనుం డయిన. 2 సంశ్రితవ్రతుఁడు దగన్. 3 రాగా, ద్యనేకదోషములు. * ఈవచనముతోఁ గలిపి పైపద్యభావము వచనముగా నొకానొకప్రతిఁ గానఁబడుచున్నది. 4 కారుణ్యమునన్.

క్కాలంబుం బటుమృత్యురోగభయశంకం బొంద మే [1]మెప్పుడున్. 191

వ. ఇది యస్మదీయప్రభావమూలంబు మీకుఁ బాతకభయంబు వలవ దరుగుం డని నం దార్క్ష్యుని వీడ్కొని హైహయులు నిజనివాసంబులకుం జనిరి భరతవంశోత్తమ యిట్టిదియ బ్రాహ్మణప్రభావం బని మఱియు మార్కండేయుండు బ్రహ్మక్షత్త్రిస్వరూపనిదర్శనం బయిన యితిహాసం బొక్కటి సెప్పెద విను మని ధర్మరాజున కి ట్లనియె. 192

చ. వినుత చరిత్రుఁ డత్త్రి యనువిప్రవరుండు తపం బొనర్పఁ గా
[2]వనమున కేఁగు చుండి తననాతిఁ గనుంగొని యి ట్లనుం దపం
బున కిదె యేను బోని వనభూమికిఁ బోవుచు నున్నవాఁడ నో
వనరుహనేత్ర నీవు నట వచ్చెదొ పుత్త్రులయొద్ద నుండెదో. 193

చ. అనుటయు భార్య యి ట్లనియె నక్కట పుత్త్రులకుం గుటుంబభా
వన యగువృత్తి యెల్లను ధ్రువంబుగఁ జేయక యాశ్రమాంతరం
బునకు మహాత్మ నీకు [3]నిటు వోవుట ధర్మువు గాదు వైన్యభూ
జనపతి యిచ్చు నర్థులకుఁ జాలఁగ నర్థము వేఁడు మవ్విభున్. 194

వ. అనినం గొండొక విచారించి భార్యపలుకులు ధర్మయుక్తంబు లగుటకు సంతోషించి యమ్మహాద్విజుం డప్పుడ చని యశ్వమేధాధ్వరదీక్షితుం డయి విప్రులకు నపారధనంబు లిచ్చు చున్నవైన్యుం గని యాశీర్వాదపురస్సరంబుగా ని ట్లనియె.

ఉ. నీవ విధాత వింద్రుఁడవు నీవ సమస్తజనేశ్వరుండవున్
నీవ యశేషధర్మములు నీవ యెఱుంగుదు నిన్నుఁ బోలఁగా
నీవసుధాతలంబున [4]మహీశ్వర యెవ్వరు లేరు సన్మునీం
ద్రావలి యెప్డు నిన్నుఁ గొనియాడుఁ బరిస్ఫుటవాక్యభంగులన్. 196

చ. అని పలుకంగ గౌతమమహాముని యచ్చటనుండి యంతయున్
విని కలుషించి యేల యిటు[5]వీఁకను నో రఱువంగఁ బ్రేలె దీ
జనపతియే విధాతయును శక్రుఁడు నీశుఁడు నర్థకాంక్షివై
మనమున శంక లేక యొకమానవు నింత నుతింప నేటికిన్. 197

అత్త్రిగౌతములపరస్పరసంవాదము.

వ. అనుటయు నత్త్రి యి ట్లనియె. 198

ఉ. ఊరక మీఱ నాడెదవు యుక్త మయుక్తము నాత్మఁ జూడఁగా
నేరవు సర్వలోకముల నిర్మలనీతిపరాక్రమంబు లొ
ప్పారఁగ నేలి ధర్మముల కన్నిటికిం గుదురై వెలుంగుధా
త్రీరమణుండు మేటిగ నుతించుట వోలదె నాకు [6]నిమ్మెయిన్. 199

1 మిమ్ములన్. 2 వనమున...తనవల్లభఁ గన్గొని...బున కిపు డేను. 3 నటు. 4 మహీశ్వరు లెవ్వరు. 5 వీఁకను నో (రెఱువంగఁ) రెఱుఁగంగఁ. 6 నెమ్మెయిన్.

వ. అని యధిక్షేపించిన గౌతముండు. 200

ఆ. కలయ నరలు వచ్చి తల తెల్ల నైనంతఁ, జేసి యెట్లు నీకుఁ జేరు నెఱుక
జ్ఞానవృద్ధుఁ డైనవానిమాటలు గదా, సభలఁ జెల్లు నార్యజనుల కెక్కి. 201

వ. అని తొడంగి యయ్యిరువురు మహానాదంబుగా వాదంబు సేయుచుండఁ గాశ్యప
నామధేయుం డైనముని సభాసదు లైనమునులం జూచి వీరలవాదు మనచేతఁ
జక్కంబడ నేరదు సకలధర్మజ్ఞుం డయినసనత్కుమారు నడుగుద మనిన నాసద
స్యు లందఱు సనత్కుమారుపాలికిం జని యత్రిగౌతముల వివాదంబు తెఱం
గెఱింగించిన నతండు వారి కిట్లనియె. 202

ఉ. అత్రి నిజంబ పల్కెఁ దగు నాతనివాక్యము ధర్మయుక్త మీ
ధాత్రి సమస్తముం బృహదుదగ్రభుజాగ్రమునందుఁ దాల్చున
త్త్రియుఁ డెల్లవారలను గావను బోవఁ బ్రభుండు గావునన్
శత్రునిషూదనుం డతఁడ శక్రుఁడు నీశ్వరుఁడుం విధాతయున్. 203

క. జనులకు నెల్లను బూజ్యుఁడు, జనపాలుం డతని[1]మహితశాసనమున స
జ్జనులును మునులును సద్విధిఁ, జనువారలు గాని కడవఁ జన దెవ్వరికిన్. 204

వ. క్షత్త్రియప్రభావం బేమనవచ్చు విరాట్సమ్రాడ్యుధాజిత్సర్వజిత్సహజిద్భభుక్
సత్యయోనిపురావిత్సత్యధర్మప్రవర్తకుండు ననుభవ్యనామంబుల నాగమంబులు
పార్థివుం గొనియాడుఁ దొల్లి యధర్మంబునకు వెఱచి బ్రాహ్మణులు నిజతేజోబలం
బులు క్షత్త్రంబున నిక్షేపించిరి నాఁటంగోలె బ్రాహ్మ్యంబువలన క్షత్త్రంబు
ప్రవర్తిల్లుచుండు బ్రహ్మక్షత్త్రంబులు పరస్పరసంశ్రయంబులు వెలిగా వర్తింప
నేరవు క్షత్త్రియుండు బ్రాహ్మణసంసేవనంబునం దేజోనిరూఢుం డయి యాది
త్యుండు చీఁకటి నడంచు నట్లు దురితంబుల నడంచు నట్లగుటంజేసి క్షత్త్రియుం
డు సర్వాధికుం డగుట నిశ్చయం బనిన నమ్మును లందఱుఁ జని వైన్యునకుఁ
దత్ప్రకారం బెఱింగించిన నాభూవరుం డత్రిం జూచి. 205

క. నను నెల్లజనులకంటెను, ఘనుఁ డని కొనియాడి తీవు కడునిజముగఁ గా
వున నీదెసఁ బ్రీతుఁడ నై, కొను మిచ్చెద నీకుఁ [2]దనియ కోటిధనంబుల్. 206

క. అని [3]యిష్టధనము లిచ్చినఁ, గొని వచ్చి మునీశ్వరుండు గొడుకులకుఁ బ్రియం
బునఁ బంచి యిచ్చి యిమ్ములఁ, జనియె వనంబునకు ధర్మసంహితబుద్ధిన్. 207

వ. అని చెప్పి మార్కండేయుండు పాండవేయునితో వెండియు నిట్లను సరస్వతీ
గీత యనునితిహాసం బొకటి సెప్పెద నందు విశిష్టధర్మంబు లెఱుంగ నగుఁ
దొల్లి తార్క్ష్యుం డనుమునివరుండు భారతి నారాధించి తనకు నద్దేవి ప్రత్యక్షం
బగుటయు నిట్లని యడిగె. 208

---

1 వాక్యశాసనమున...జనఁ దగ దెపుడున్. 2 గోటికోటిధనంబుల్. 3 యిట్లు ధనము...
సంయుతబుద్ధిన్.

క. పురుషున కెయ్యది ధర్మువు, పురుషుం [1]డెద్దానఁ బరమపుణ్యాత్మకుఁ డై
చిరపుణ్యగతులు వడయును, దిరముగ నవి యానతిమ్ము దేవీ నాకున్. 209

వ. అనిన నతనికి నప్పరమేశ్వరి యిట్లనియె. 210

మ. శ్రుతి వేదంబులు నాలుగుం జదివి భూదేవుండు నానాధ్వర
వ్రతుఁ డై యుండెడు నట్టిపుణ్యుఁ డమరావాసంబునం దుండు ను
న్నతవృత్తస్తనభారమంథరమరున్నారీపరీరంభసం
భృతరోమాంచసముంచితాంగుఁ డగుచుం బెక్కేండ్లు సంప్రీతితోన్. 211

సీ. మేలగు క్రేపుతోఁ బాలు సాలఁగఁ గల్గి, లాలితం బగుతోలుచూలిమొదవుఁ
బాత్రభూతుం డైన శ్రోత్రియునకు నిచ్చు, సదమలచరితుఁ డమ్మొదవుమేన
నెన్నిరోమము లుండు [2]నన్నివే లేండ్లును, సురలోకసౌఖ్యవిస్ఫురణ నొందు
భారంబునకుఁ జాలి భూరిసత్త్వాఢ్య మై, బిరుదైనయెద్దు భూసురున కిచ్చి

ఆ. నరుఁడు ధేనుదశక మిర వొంద నిచ్చిన, ఫలము వడయు మంచివలువ లొసఁగి
చంద్రలోకమునకు సంప్రీతుఁ డై చనుఁ, గనక మిచ్చి నాకమునకు నరుగు.

క. కృతమతి యై యేడేఁడులు, [3]ఘృతమున హుతవహుని బ్రీతి నొందించినను
వ్రతుఁ డీరేడుతరంబుల, పితరులఁ గొని దివికి నేఁగుఁ బెం పెసలారన్. 213

క. సతతంబును శుచి యై [4]దే,వతలఁ బ్రదీప్తాగ్నియందు వదలక నంత
ర్పితులుగఁ జేసి పడయు నం,చితముగ గోలోకవాసచిరసౌఖ్యంబుల్. 214

వ. అగ్నిహోత్రం బస్మదాత్మకం బని యెఱుంగుము సకలయజ్ఞంబులయందుఁ గ
ల్గింపంబడువిశిష్టద్రవ్యంబు లన్నియు మదీయంబుల నేను మహనీయం బైనయగ్ని
హోత్రముఖంబున ననుభవింతు నాత్మజ్ఞు లైనమహాత్ములకు నఖిలసంశయచ్ఛే
దంబు సేయుదు ననవరతతపస్స్వాధ్యాయదానవ్రతపరాయణు లైనతపోధను
లెందేని విగతశోకు లై [5]వసియింతు రట్టిది మామకం బైనపరమపదంబు వినుము
ప్రచురమధుక్షీరతోయంబులును శర్కరాసైకతంబులును మాంసాపూపప్రక
రతీరంబులును బాయసకర్దమంబులు నైనయేఱు లనేకంబు లుత్పాదించి
యింద్రాగ్నిప్రముఖు లైనదివిజులకుఁ దృప్తిసేసి యజనశీలురు పెక్కేండ్లు మ
త్పదంబుం బ్రాపింతు రని చెప్పినఁ దార్క్ష్యుండు కృతాంజలి యై. 215

ఉ. అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీప్తికా
చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తవివిక్తనిజప్రభావ భా
వాంబరవీథివిశ్రుత[6]విహారి ననుం గృపఁ జూడు భారతీ. 216

---

1 డెద్దానివలనఁ బుణ్యాత్మకుఁ. 2 నన్నివే లేఁడులు...మఱియు వలువ...లోకమున కతంద్రితుఁ డై. 3 హుతమున హుతవహునిఁ బ్రీతునిఁ జేసినను...రులతో నరుగు దివికిఁ బెం పెసలా. 4 సు,వ్రతులఁ బ్రదీప్తా. 5 చరియింతు. 6 విహార.

వ. అని వినుతించి కృతార్థుం డయ్యె నని చెప్పిన విని పాండుపుత్త్రుండు ముకు ళితహస్తుం డై మునీంద్రా వైవస్వతమను వెత్తెఱంగునం బ్రభావసంపన్నుం డయ్యెఁ జెప్పవే యనిన మార్కండేయుం డి ట్లనియె. 217

క. విను చాక్షుషమన్వంతర, మున వైవస్వతుఁడు పరమపుణ్యుండు దపం
బొనరించె నిరాహారత, ననుపమధైర్యుండు దశసహస్రాబ్దంబుల్. 218

ఆ. అనఘుఁ డూర్ధ్వబాహుఁ డై యేకపాదంబు,నందు నిలిచి బదరికాశ్రమమున
జలిపె మఱియుఁ బెక్కుసంవత్సరంబులు, [1]తపము సకలజనులుఁ దను నుతింప.

—॥ మార్కండేయుండు ధర్మరాజునకు వైవస్వతువృత్తాంతంబును దెల్పుట. ॥—

వ. ఆవైవస్వతుం డొక్కనాఁడు గృతస్నానుం డయి జలాశయతీరంబున నున్నంత నొక్కమత్స్యంబు జలంబులదరికిం జనుదెంచి యి ట్లనియె నయ్యా యేను గడు నల్పమత్స్యంబ నగుటం జేసి బలవంతంబు లగుజలచరంబులవలన నాకుఁ దద్దయు భయంబు గలిగి యుండు నిమ్మడువు మహామత్స్యసంకులంబు గావున నపాయం బు వొందకుండ నన్నుద్ధరించి యొండెడం బెట్టవే యేను నీకుఁ బ్రత్యుపకారంబు సేయ నోపుదు ననిన విస్మితుండై యతం డమ్మీను నెత్తికొని పోయి యొక్క నూతియందు విడిచి దానిం బలుమాఱు నరసికొని యుండె నదియును గ్రమం బున [2]వరిల్లి యొక్కనాఁ డమ్మనువున కి ట్లనియె. 220

ఆ. అనఘ నీప్రయత్నమున నాశరీరంబు, వొదలె నిందు నాకు మెదల నెడము
సాల దట్లు గాన [3]మేలుగ నొండొక, యెడకుఁ గొంచుఁ బొమ్ము కడఁగి నన్ను.

వ. అనిన నతం డాజలచరంబుఁ గైకొని పోయి యొక్కబావియందు విడిచిన నది యెప్పటియట్ల యక్కజంబుగాఁ బొదలి తనకు నవ్వాపియందు నవకాశం బప ర్యాప్తం బగుటం జెప్పి యతనిచేత గంగమడువున విడువంబడి కాలక్రమంబున నచ్చోటఁ దిరుగం బట్టు చాల కున్న నతం డెత్తికొనిపోయి సముద్రంబునం బెట్టిన నది వాని కి ట్లనియె. 222

క. ఉపకారం బొనరించితి, కృపతో నీ విట్లు నాకుఁ గృతమతి [4]వై ప్ర
త్త్యుపకార మే నొనర్చెద, విపులగుణాభరణ తెలియ విను నాపలుకుల్. 223

తే. తడవు లేదింకనిఖిలభూతములుఁ బ్రళయ,మొందనున్నవియిప్పుడొండొండపొంగి
కలయఁ బాఱుఁబయోధులు గ్రముగఁబుణ్య,చరితయిదియమన్వంతరసంధియంద్రు.

వ. కావున నీవు దృఢరజ్జుబంధనంబును సకలధనధాన్యసహితంబును గా నొక్క పేరోడ గావించి సప్తమునిసహితుండవై దాని నెక్కి సముద్రంబు దఱిసి నన్నుం దలంచునది యేనును ఘనశృంగశోభితం బయినరూపంబునఁ బొడసూపి మీకు

1 సకలజనులుఁ దన్ను సంస్తుతింప. 2 వర్ధించి. 3 బోలఁగ నొం డొక్క. 4 వై ప్ర, త్యు పకారం బొనరించెద.

మే లొనరించెద నని యమ్మత్స్యంబు సనియె వైవస్వతుండును దదుక్తప్రకా
రంబున నోడ నిర్మించి సకలబీజంబులు సంగ్రహించి సప్తమునిసహితంబుగాఁ 225
గృతారోహణుండై పయోధిదఱియం దొడంగె నంత.

మ. మఱి వైవస్వతుచేఁ దలంపఁబడి యమ్మత్స్యంబు దోఁతెంచె నా
యతశృంగోన్నతమూర్తి నాతఁడుఁ దదాజ్ఞాయత్తుఁడై తచ్ఛిరో
గతశృంగాగ్రము[1]నం దగిల్చె నతిదీర్ఘం బైనపాశంబు న
ద్భుతవేగంబున నోడ నీడ్చె నది యంభోరాశిమధ్యంబునన్. 226

వ. తదనంతరంబ. 227

సీ. గరుసులు గడవంగఁ [2]గదలి యల్లల్లన, యొత్తుచు నెడముల నుత్తరించి
వేడుకఁ జేతులు వీచి యాడెడునట్లు, లోలోర్మిపంక్తులఁ గ్రాలిక్రాలి
ప్రమదహాసస్ఫూర్తి పచరించువిధమున, నురుఫేనరోచులఁ దెరలు గలిగి
యురువడి వర్ధిల్లుచున్నజలంబుచేఁ, బొంగారి దెస లెల్ల మ్రింగికొనుచు
ఆ. బ్రబలవిలయకాలపటురయబహుళశ్వస, నీరణౌఘదుర్నివార మగుచు
నుగ్రభంగిగాఁ బయోనిధు లొక్కటఁ, బెల్లురేఁగి జగము వెల్లివొడిచె. 228

వ. ఇట్లులోకంబెల్ల నేకార్ణవంబైనయమ్మత్స్యంబు దజ్జలాంతరంబున ననేకసహస్రవర్షం
బు లయ్యోడం దిగుచుచుఁ బదంపడి యప్పెనువెల్లి యల్ల నల్లఁ దిగిచి పోవం దొ
డంగు నెడం దుహినగిరిశృంగసమీపంబున నయ్యోడ నిలిపి వారలతోడ. 229

తే. ఈనగంబుశృంగంబున నిపుడు మీరు, గట్టుఁడియ్యోడ ననిన నాక్షణమ వారు
నట్ల చేసిరి విను మమ్మహాద్రిశృంగ, మనఘ నౌబంధనం [3]బన నవనిఁ బఱఁగె.

క. మనుసహితు లైనమునులం, గనుఁగొని యమ్మీను గరము గారవమున ని
ట్లనుఁ బ్రళయంబునకీడునఁ, జన కుండఁగ మీకు రక్ష సలిపితిఁ గరుణన్. 231

క. మునులార యేను విశ్వం, బునకుఁ [4]బరమకర్త యగుప్రభుఁడ వాత్సల్యం
బున మత్స్య మైనరూపం, బున నిమ్మెయి నిన్నిచందములఁ జన వలసెన్. 232

వ. మీరు నిర్భయుల రై చరియించునది మఱియు నిమ్మనువును సదేవాసురమా
నుషం బైనజగం బఖిలంబును సృజియించు మత్ప్రసాదంబున నితనికిఁ బరమ
జ్ఞానోదయం బగు నని చెప్పి యయ్యాదిమత్స్యం బదృశ్యం బయ్యె వైవస్వతుం
డును మఱియు నధికతపంబు సేసి సకలచరాచరంబుల సృజియించె. 233

క. పరమం బగువైవస్వతు, చరితం బతిభక్తి వినినఁ జదివినను మహా
దురితంబు లడఁగు జనులకు, నిరవుగ సిద్ధించు ననఘ యిహపరసుఖముల్. 234

వ. అనిన నమ్మేదినీశ్వరుం డమ్మునీశ్వరునకుఁ బ్రణతుం డై యిట్లనియె. 235

---

1 నందు నిల్పె నతి. 2 గెరలి...యాడెడుభంగి...ప్రచురహాసస్ఫూర్తి...చాడ్పున, దిరుగు ఫేనంబుల దిశలు...బహుళసమీర (సఘోర); స,మీరణౌఘదుర్ని...జగము లెల్లఁ బొదివె. 3 బునా నవనిఁ బఱఁగె. 4 బ్రథమకర్త.

క. పరమేష్ఠికల్పుఁడవు ని, ర్భరభూరితపః[1]ప్రబోధపరిపూర్ణుఁడ వ
చ్చెరువు భవన్మాహాత్మ్యము, సురమునిలోకప్రణామశోభితచరణా. 236

క. [2]అడరి నిఖిలాండకోటియుఁ, జెడునప్పుడు జెడవు నీవు జీవించెద వే
ర్పడ జగములు గ్రమ్మఱఁ గలి, గెడునప్పుడు సూచెదవు వికృతిరహితుఁడ వై.

చ. తొడరి చరాచరప్రతతితో జగ మింతయు వార్ధి దొట్టిన
ప్పుడు లలితాబ్జపీఠమునఁ బొల్చుచతుర్ముఖుఁ బద్మగర్భుఁ బెం
పడర భజించి తీవు జగదాదిజుఁ డైనప్రభుండు నీమెడం
గడు ననురక్తుఁ డై యొసఁగెఁ గాదె మునీశ్వర యీప్రభావమున్. 238

క. జగముల నెల్లను మ్రింగెడు, జగదంతకుమహాళివాముచరణం బిడఁ బె
ల్లగురోగజరాభరముం, దెగ విడువఁగఁ జెల్లె నీకుఁ ద్రిభువనవినుతా. 239

వ. సకలచరాచరోత్పత్తిస్థితివిలయప్రకారంబులు నీకుం బెక్కుమాఱులు ప్రత్యక్షం
బు లయి కానంబడి యుండుఁ గావున ని న్నడిగెద లోకంబులు విలయకాలంబున
నెట్టిభంగి యగు నెఱింగింపు మనిన మార్కండేయుం డి ట్లనియె. 240

మార్కండేయుండు ధర్మరాజునకుఁ బ్రళయప్రకారంబు సెప్పుట.

సీ. శాశ్వతు నఖిలభూతేశ్వరు నవ్యయు, నాదిదేవుని జగదాదిజన్ము
నాదిమధ్యాంతవిచ్ఛేదవిదూరు నా, శ్చర్య[4]కారణకర్మధుర్యు నజరు
గురుఁడునీకిష్టసఖుఁడును బెగ్గడయునై, వెలుఁగొందుచున్నయీయలఘుపుణ్యు
లాలితదీర్ఘవిశాలసితేక్షణుఁ, గనకవర్ణాంబరు వనజనాభు

ఆ. నింద్రనీలవర్ణు నింద్రాదిసురగణ, వినుతుఁ గృష్ణుఁ గరము వినయ మొప్పఁ
దలఁచి యితనియాజ్ఞ దలనిడి యెఱిఁగింతు,వినుము వరుసతోడ మనుజనాథ.

వ. కృతత్రేతాద్వాపరకలినామంబు లయినయుగంబులు నాలుగును బండ్రెండువేల
దివ్యవర్షంబులం బర్యవసితంబు లగు నియ్యుగంబులు నాలుగు నొక్కమహాయు
గం బనం బరఁగు మహాయుగసహస్రపర్యంతం బైనకాలంబు బ్రహ్మకు నొక్క
దివం బనంబడుఁ దద్దివసావసానంబునందు శతవార్షికం బైనయనావృష్టిదోషం
బు ప్రవర్తిల్లు నప్పుడు. 242

ఆ. సప్తహాయుఁడు మూర్తి[5]సప్తకంబొగిఁదాల్చి, కరము వేఁడి మిగులుకరములొప్ప
నదనదీజలములు నుదధిజలంబులుఁ, బీల్చి జగము లెల్లఁ బోల్పుఁ గడఁగి. 243

చ. దినకరతిగ్మతేజము ప్రదీప్తమహాతాశనుఁ డయ్యుగాంతసం
జనితమహాసమీరణవశంబునఁ జేర్చి నగవ్రజంబుతో
మనుజులతోడ నిర్జరసమాజముతోడ భుజంగపంక్తితో

---

1 ప్రభావపరిపూర్ణుఁడ వ, చ్చెరువగు భవన్మహత్త్వము. 2 ఎడలి యఖిలాండ ... సెడక బ్రబ
దికి. 3 భజించె దీవు. 4 కారణు ధర్మధుర్యు ; కారణ కర్త ధుర్యు... సఖుండు బెగ్గడయు నై
...దలకొని యెఱిఁ. 5 సప్తకంబు ధరించి.

దనుజులతోఁ జగత్త్రియము దత్క్షణమాత్ర [1]నొనర్చు నీఱుగాన్. 244
వ. తదనంతరంబ. 245
మ. సితపీతారుణనీల[2]పింగళరుచిస్తోమోల్లసద్విద్యుదా
యతరేఖాంకము లై మహాగజగిరీంద్రాకారఘోరంబు లై
తతనిర్ఘాతనిపాతభీమభిదురధ్వానంబు లై సంతతో
ద్ధుతసంవర్తవలాహకంబులు వెసం దోఁతెంచు దిగ్భిత్తులన్. 246
ఉ. [3]పెల్లునఁ గూలుతజ్జలము పెక్కున నొక్కట నమ్మహానలం
బెల్లను నాఱిపోవఁ బృథివీశ్వర యేఱులు నబ్ధులున్ వెసం
దొల్లిటియట్ల నిండఁ బటుతోయదసంఘము లంతఁ బోక గ
ర్జిల్లుచు వెండియుం గురియుఁ జిత్రముగాఁగ ననేకకాలముల్. 247
శా. ధారాపాతనితాంతవేగమున నిద్ధాత్రీతలం బాహతం
బై రూపేది మునుంగఁ దోయములలో నత్యంతగంభీరవాః
పూరం బంతయు ముంచి మించుటయు దిగ్భూమీనభోభాగముల్
వేరూపింపఁగ రాకయుండఁ దమముల్ వేష్టించుఁ ద్రైలోక్యమున్. 248
తే. అంతఁ బరమేష్ఠిచోదిత మైనయొక్క, మారుతము నలిరేఁగి దుర్వారభంగి
విలయకాలవిశృంఖలవిపులవారి, ధరచయంబుల నెల్లను విరియఁ [4]జేయు. 249
క. ఆమారుతంబు గ్రోలి పి, తామహుఁ డంతయును ఘోరతమ మగుసలిల
స్తోమంబునందు నడుమం, దామరపై నిదురవోవుఁ దద్దయు నెమ్మిన్. 250
వ. ఇట్టికల్పాంతంబు లనేకంబులు సనియె నింకఁ గానున్నవి యనేకంబులు విను మతీ
తకల్పాంతసమయంబున నేను బ్రబలాంధకారంబున నేదెసయుం గానక యొక్కం
డన యత్యంతభయాతురుండ నగుచుం బెద్దకాలంబు పరిభ్రమించుచుండ నొక్క
తఱి నయ్యుదకమధ్యంబున నత్యున్నతం బయినవటభూరుహంబు గానంబడియె
మఱియుఁ దదీయపర్ణపర్యంకంబునందు. 251
క. కమనీయజలదవర్ణుని, హిమకరబింబాస్యు నుద్యదినతేజుఁ బ్రమో
దమునఁ బవళించువానిం, గుమారు నొక్కరునిఁ గుసుమకోమలు గంటిన్.
వ. కని విస్మితుండ నై యాత్మగతంబున. 253
క. లోకంబులు దెగటారఁగ, నేకార్ణవ మైనయిచట నిబ్బాలుఁ డొకం
డేకతమున నిద్రించుచు, నేకతమున నున్నవాఁడొ యెవ్వాఁ డగునో. 254
తే. అని తలంచుచు నల్లన యక్కుమారుఁ, జేరఁబోయిన నాతండు సితసరోజ
రేఖ [5]దలకొనఁగా నలరించెఁ గన్ను, లవధరించెను నను లోచనాంచలముల.

1 న నేర్చు నీఱుగాన్; న నీఱు చేయఁగన్. 2 హింగులరుచుల్ (పింగరుచులై) స్నిగ్ధంబులై యుద్యతా, యతవిద్యుల్లలితంబు లై ఘనగిరిం. 3 పెల్లుగఁ గూరు (బాఱు) తజ్జలము, పెక్కువ. 4 నడచు. 5 దలకొన సిరి నలరించు (దలకొనఁగా నడరించె) కన్ను, లమరఁ జూచెను.

వ. తదనంతరంబ గంభీరమధురస్వరంబున నిట్లను నయ్యా నిన్ను నతిశ్రాంతుంగా నెఱింగితిఁ గొండొకసేపు విశ్రమింపవలతేని నవకాశం బిచ్చెద నాశరీరంబు ప్రవేశించి సుఖంబున శయనింపు మని తనవదనంబు వివృతంబుగాఁ జేసిన నేనును బలాత్కార [1]నిక్షిప్తశరీరుండునుంబోలె బరవశుండనై తన్మార్గంబున నతని యుదరంబుఁ బ్రవేశించి యందు. 256

సీ. గంగాదినదులతోఁ గనకశైలాదిభూ, ధరములతో సముద్రములతోడ
వివిధ[2]పత్తనవనద్వీపవర్షములతో, బహుకర్మరతులైన ప్రజలతోడఁ
బక్షిమృగవ్యాళపశుసంఘములతోడఁ, దద్దయు నొప్పారు ధాత్రిఁ గంటి
సూర్యేందుతారకాజ్యోతిరుజ్జ్వలమైన, గగనంబుఁ బవనమార్గములుఁ గంటి
తే. శక్రవరుణయమాదినిర్జరసమేత, మైననాకంబు గంటి మహాహియక్ష
రాక్షసాసురవిద్యాధరప్రముఖులఁ, గంటి వేయేల సకలలోకములుఁ గంటి.

చ. అరుదుగ నమ్మహాత్ముని మహాజఠరాంతరభూమి నూఱువ
త్సరములయంతకాలము [3]వసం బఱి త్రిమ్మరితిం గడంగి య
ప్పురుసున నెందుఁ గాల్గొనఁగఁ బట్టదు చిత్తము భీతి మీఱఁ ద
త్పరమతి నంత నక్కపటబాలుపదంబులు సంస్మరించితిన్. 258

వ. ఇట్లు శరణ్యవరేణ్యుండైన కారుణ్యనిధి నద్దేవుం దలంచుచుండ నతండు నన్నుం దనవదనానిలవేగంబునం జేసి వెలువరించె నంత నెప్పటియట్ల మ్మహావటవిటపిశయనుండైన యబ్బాలు నాలోకించితి నంత. 259

క. [4]ననుఁ గనుఁగొని యెలనవ్వున, దనవదనము వింతచెన్ను దలకొనఁగా ని
ట్లను నబ్బాలుఁడు విశ్రమ, మొనరించితె యనఘ యస్మదుదరములోనన్.

వ. అనిన నేనును సంభ్రమంబున నతనిం జేర నరిగి కెందామరరేకులం దెగడునంగుళంబులు గలిగి తరుణకిసలయసుకుమారంబు లయినతచ్చరణకమలంబులు శిరంబునం జేర్చి దేవా దేవరప్రసాదంబున నత్యాశ్చర్యకారణంబైనసకలచరాచరభూతప్రపంచంబుఁ జూచితి భవదీయమాయాప్రభావంబు భావింపనేరకున్నవాఁడ.

శా. ఈయేకార్ణవ మీవటక్షితిరుహం బీపర్ణపర్యంక మి
ట్లీ యొప్పారుచు నుండఁగా నుదరభాగైకప్రదేశంబునం
దీ యీరేడుజగంబులుం మెలఁగఁ గా నిట్లున్నబాలత్వ మే
నేయందంబున నిశ్చయించి సుఖనై యేపారుదుం జెప్పవే. 262

క. నా కైనయాశ్రితత్వము, నీ దగుచిత్తమునఁ గల్మి నియతమయేనిన్
సాదరఫణితుల నన్నవ, సాదితసమ్మోహుఁగాఁ [5]బ్రసాదింపు తగన్. 263

---

1 క్షిప్తుఁడుం బోలె. 2 పట్టణనవద్వీప. 3 ముదంబున త్రిమ్మరితిం...గీ ల్కానఁగ...త్పరమతి నయ్యు. 4 కనుఁగొని యల్లనినవ్వున. 5 బ్రసాదింపఁ దగున్.

నారాయణుఁడు మార్కండేయునకుఁ దనప్రభావంబు సెప్పుట.

క. అని యేను వేఁడికొనుటయు, ఘనతర కరుణారసానుకలితహృదయుఁడై
తనదివ్యమహిమ యిట్లని, వనజాక్షుఁడు సెప్పె గారవంబున నాకున్. 264

ఆ. అనఘ దేవతలును మునులును నాదైన, మహిమఁ దెలియ లేరు మహితబుద్ధి
నతులపుణ్యమతివి పితృభక్తుఁడవు గాన, యెలమి [1]దెలియఁ జెప్పవలసె నీకు. 265

క. నారము లండ్రు జలము లిం, పారఁగ నారములు నాకు నయనం బగుటన్
నారాయణుఁ డను పేర న, పారనిగమఫణితులందుఁ బరఁగుదుఁ బేర్మిన్. 266

తే. అట్టినారాయణాఖ్యుండ నైననేను, శాశ్వతుండనై ప్రభుఁడనై సకలజగము
నోలిఁ బుట్టింతుఁ బాలింతు నుచితవేళ, సంహరింతుఁ జిదానందశాలి నగుచు.

మత్తకోకిలము. అంబుజాసనుఁ డింద్రుఁ డీశ్వరుఁ డంతకుండు ధనేశ్వరుం
డంబుధీశుఁడు లోనుగా సుర లస్మదాకృతు లుర్వి పా
దంబు లగ్నిముఖంబు సూర్యసుధాకరుల్ నయనంబు లీ
యంబరంబు [2]శిరంబుగా నిటు లద్భుతాకృతి నుండుదున్. 268

చ. అతులితదక్షిణాన్వితమహాధ్వరసంఘము లే నొనర్చితిం
జతురమనీషితాప్రచురసౌఖ్యులు భూసురముఖ్యు లంచిత
వ్రతులు మహీపతుల్ సుగుణవశ్యులు వైశ్యులు భక్తి నన్ను సం
తతమును గొల్తు రీక్షితి నుదాత్తమహా[3]క్రతుకర్మశీలు రై. 269

చ. విలయపయోధిమగ్న మగువిశ్వమహీవలయంబు దొల్లి యే
నలఘువరాహవిగ్రహుఁడ నై వెస నెత్తితి శేషమూర్తి నై
లలితఫణాసహస్రకము లావునఁ దాల్తు నశేషధాత్రియున్
జలనిధి నిమ్నగా నగ లసన్నగరీ వనమండలంబుతోన్. 270

క. బాడబదహనుఁడ నై [4]వెస, నేడుసముద్రములజలము లేఁ గ్రోలుదు నీ
రేడుజగంబులు విలయముఁ, గూడు నెడం దజ్జలములు గొనకొని విడుతున్.

చ. వదనభుజోరుపాదముల వర్ణచతుష్టయమున్ యుగాదియం
దొదవ సృజింతు ఋగ్యజుషసూక్తులు సామము నయ్యథర్వమున్
విదితముగా మదీయముఖవీథుల నుద్భవ మొందు నన్నియుం
దుదిఁ బరివర్తనక్రమవిధూతము లై ననుఁ జేరుఁ గ్రమ్మఱన్. 272

క. అనహంకృతు లక్రోధను, లనసూయులు సంగరహితు లధ్యాత్మవిదుల్
ఘనసత్త్వాత్మకులు మహా, మునులు ననుం గొల్తు రెప్డు మోక్షాపేక్షన్. 273

తే. అఖిలనక్షత్రతారాగ్రహములు గగన, పవనదిశలును మత్స్వరూపములు వినవె
సకలరత్నాకరంబులు శయ్య గాఁగ, నిత్యసుఖలీలమై శయనింతు నేను. 274

1 నీకుఁ జెప్ప వలసె దెలియ. 2 శరీర మే నిటు. 3 వ్రతకర్మ; క్రతుధర్మ. 4 వడి... విలయముఁ, గూడెడు నెడఁ దజ్జలంబు.

క. దానము సత్యంబు తపో, జ్ఞానాహింస లనఁ బరఁగుసాత్త్వికగుణసం
తానముఁ గామక్రోధా, జ్ఞానంబులు మన్మయములు సంయమివర్యా. 275
క. విను మింకఁ బెక్కుమాటలఁ, బనియేటికి జగమునందుఁ [1]బ్రకటితమతిఁ గ
ల్గినయదియు లేనియదియును, నొనరఁగ నేనని మనమున నూహింపు తగన్.
ఉ. ఎప్పుడు ధర్మహాని యగు నెప్పు డధర్మము మీఱుఁ గ్రూరు లై
యెప్పుడు దైత్యు లుబ్బుదురు హీనతఁ బొందుదు రెవ్వ వేల్పు లే
నప్పుడు సత్కులీనులగృహంబుల నుద్భవ మొంది లీల మై
నెప్పటియట్ల నిల్పుదు సురేంద్రుల నంచితధర్మపద్ధతిన్. 277
క. సితరక్తనీలపీత, ద్యుతివిలసితరూపముల జతుర్యుగముల నేఁ
గృతమతిఁ [2]జరియించి సమం, చితధర్మస్థాపనంబు సేయుదు ననఘా. 278
మత్తకోకిలము. కాలచక్రము నిర్వికల్పము గాఁగ [3]నే నొనరింతు ను
న్మీలితక్రమవిక్రమైకసమృద్ధి నై లయవిక్రియా
వేళ నింతయు సంహరింతుఁ బ్రవృద్ధయోగబలోల్లస
త్కాలరూపము దాల్చి దుర్వహగర్వనిర్వహబుద్ధి నై. 279
క. [4]నా తెఱఁ గిప్పుడు నెంతయు, చేతోముద మొదవ నీకుఁ జెప్పితిఁ ద్రిజగ
ద్ధాత యగుపితామహుఁడును, జాతుఁడు నాయొడలఁ జక్క నగ మని కనుమీ.
వ. నారాయణాభిధానుండ నైనయేను బాలరూపంబున శంఖచక్రగదాధరుండ నై
యేకార్ణవంబునందు మహాయుగసహస్రమయం బయినకాలంబున యోగనిద్రా
పరవశుండ నై యుండుదు నిట్టిదారుణకల్పాంతంబు నూచి నీవు భీతుండ వగు టె
ఱింగి నీవలనియనుగ్రహంబున నాత్మగుప్తంబు లైనసకలలోకంబులు నీకుం గను
నట్టితెఱంగుఁ గావించితి నింక నిశ్శంకహృదయుండ వయి వలసినయెడం జరి
యింపుము మదీయనాభికమలకర్ణికాశయనుం డయి యున్నచతురాననుండు
మేల్కని సృజియించులోకంబు లేర్పడం జూచెద వని యానతిచ్చి యద్దేవుం
డంతట నంతర్హితుం డయ్యె నత్యంతవిచిత్రం బైనయీవృత్తాంతం బంతయు
నాకు ననుభవగోచరం బైనయది. 281
శా. నా కమ్మెం బొడసూపెఁ దాను గృపతో నాఁ డందు నేఁ డీయ్యెడన్
నీకున్ గాదిలిచుట్ట మై సచివుఁ డై [5]నెయ్యంబు నై యున్నవు
ణ్యాకారుం గమలాయతాక్షుఁ గరుణైకాయత్తు నత్యుత్తమ
శ్లోకుం గృష్ణునిఁ గంటి నానుకృతముల్ శోభిల్లెఁ బక్వంబు లై. 282
క. ఈదేవదేవుకరుణం, గాదే కురునాథ నిర్వికారుఁడ నై నిఁ

---

1 బ్రకటితముగఁ గ, ల్గినయదియు నేన లేనది, యును నేనని నిశ్చితముగ నూహింపుమదిన్; లేనది, యును నేన సునిశ్చితముగ నూహింపు మె (దన్) దన్. 2 జనియించి. 3 నే నవహింతు. 4 నా తెఱఁ గంతయు నిప్పుడు, చేతో. 5 నెయ్యంబు మై నున్న.

ఖేదుఁడ నై యుండుదు దే, వాదివివిధభూతవిలయ మయ్యెడు నపుడున్. 283
తే. అనఘ యి ద్దేవుసన్నిధి యగుటఁ గాదె, నాకుఁ బూర్వవర్తనకథనంబునందు
బోధ మిప్పుడుగల్గె నిప్పుణ్యుఁ బరమ,పురుషుఁ బ్రభవిష్ణుఁ గృష్ణునిశరణు సొరుము.

మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గలియుగధర్మంబులు సెప్పుట.

వ. అనిన విని ధర్మనందనుం డనుజసహితుం డై కృష్ణునిం బ్రశంసావచనంబుల నభి
నందించి మార్కండేయుం జూచి మునీంద్రా భవత్ప్రసాదంబున నత్యద్భుత
పుణ్యకథాశ్రవణపరితోషితుల మైతిమి కలియుగంబున సకలధర్మలోపం బగు
నని చెప్పెదరు తత్ప్రకారం బెఱింగింపవే యనిన నతం డతని కి ట్లనియె. 285
క. కృతయుగమునందు ధర్మము, చతురంశంబులను బరఁగఁ జనుఁ ద్రేతాది [సన్.
త్రితయమున నొక్కొకఁడుగఁ, బ్రతియుగమునఁ దఱుఁగఁ దొడఁగుఁ బాళులువరు
వ. అట్లగుటం జేసి ధర్మంబు చరమయుగంబునఁ గరంబు దుర్లభంబయి పాదమాత్రా
వశిష్టం బయి యుండుఁ దత్ప్రవర్తనం బాకర్ణింపుము. 287
సీ. సత్యంబు నరులకు సంక్షిప్త మగు సత్య, హాని నాయువు గడు నఱిగి పోవు
నాయువు దఱిఁగిన నల్పంబు లగు విద్య, లల్పవిద్యుల విమోహంబు మిగులు
మోహంబువలనఁ బై ముసురు లోభంబు లో,భావేశమునఁ గామ మగ్గలించుఁ
గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు క్రో,ధంబున వైర మెంతయును బెరుఁగు
ఆ. వైరమున నశేషవర్ణులు నన్యోన్య, పీడ సేయుచును విభిన్నబుద్ధి
నొక్కఁ [1]డొకఁడు మేర నుండక వర్ణసం,కరము సేయఁ గలరు కలియుగమున.
క. జపనియమస్వాధ్యాయ, ప్రపంచములు విడువఁ గలరు బ్రాహ్మణులు జనా
ధిప శూద్రులు విపులతపః, కుపితులు గాఁ గలరు వినవె కలికాలమునన్. 289
మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులము లై విస్తీర్ణశూన్యాటవీ
నివహాభీలము లై యరాజకము లై నిర్మూలధర్మంబు లై
ద్రవిళాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తిదుష్టంబు లై
భువిలో నెల్లెడఁ బాడగుఁ జనపదంబుల్ దద్యుగాంతంబునన్. 290
క. క్షత్త్రియజాతులు శూద్రచ, రిత్రంబున శౌర్యమును సిరియుఁ దేజంబుఁ
మైత్త్రియును లేక చెదరి ధ, రిత్రీశ్వర శూన్యు లై చరించెదరు దగన్. 291
క. రసగంధద్రవ్యంబులు, పస చెడు సస్యంబు లల్పఫలము లగు మహిం
బసిపాఁడి దఱుఁగుఁ దరువులఁ, గుసుమఫలంబులును [2]గరముఁ గొంచెంబు లగున్.
క. అరులు మిగులఁ గొని రాజులు, నరులకు నెంతయును భయ మొనర్తురు ధరణీ
సురులు గడఁగి వాణిజ్యముఁ, గరిసనమును జేయఁగలరు కలికాలమునన్. 293
సీ. పాషండదర్శనబాహుళంబు లై యుండు, వర్ణాశ్రమంబులు వసుమతీశ
తవిలి శరీరంబుఁ దద్దయుఁ బ్రోతురు, పుణ్యఫలంబులు బొంకు లనుచుఁ

1 డొకనిమేర. 2 నెంతఁ గొంచెంబు.

గాలంబుతోఁ గూడఁ గల్గవు వానలు, పొల్లు లై బీజముల్ వొలిసి పోవుఁ
గ్రయవిక్రయంబులఁ గపటంబు దఱచగుఁ,గడఁగి యిల్లడసొమ్ము లడఁచికొండ్రు
ఆ. సాధుచరితు లైనజనులు దుర్గతుల రో, గముల దెగుదు రల్పకాలమునన
పాపపరులు లగ్గఁ బరమాయువును నరో,గతయు సిరియుఁబొందఁగాంతు రెందు.
క. ఉఱ వగు [1]నారికెపంటలు, గొఱియలపాఁడియును దఱచగుం బురుషులకుం
దెఱవలు సుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్. 295
క. పితృదైవతకార్యంబుల, నితరేతరభోక్త లగుదు రెల్లయెడలఁ గు
త్సితదేశకాలపాత్ర, ప్రతతియ వర్తించు దైవపైతృకవిధులన్. 296
క. హేతుప్రత్యయవాదవి, చేతసు లై [2]వేదనింద సేయుచును మఖ
వ్రాతంబులు వ్రతములుఁ బెడఁ, బాతురు దుర్మార్గకర్మపరు లై విప్రుల్. 297
మ. వనితాదుర్బలదీనబంధుజనసర్వస్వాపహారుల్ సుహృ
జ్జనమాతాపితృపుత్త్రిహంతలు యదృచ్ఛాకర్మశీలుర్ ధరక్
జనసంపూజితు లై చరింతురు వినష్టశ్రీకు లై విప్రు లా
జనులం జేరి [3]ప్రతిగ్రహించెద రవజ్ఞాపూర్వదుర్వృత్తముల్. 298
మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బశ్యతో
హరు లై సాధుల [4]ద్రోఁచి చేకుఱుతదీయస్త్రీధనక్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరం బై పెల్లు చెల్లుం బర
స్పరయుద్ధంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణినాశంబుగన్. 299
క. సుతుఁ డవమానించు జనకుఁ, బతి నవమానించు భార్య పడఁతులుఁ బతులక్
మతి నొండొరువుల మెచ్చక, సతతముఁ జరియింతు రిష్టసంచారములన్. 300
క. నడవవు దేవపితృక్రియ, లుడుగును వేదార్థసమ్యగుపదేశంబుల్
గడఁగు[5]ను మోహాతమంబులు, పుడమి సమస్తంబుఁ గుజనభూయిష్ట మగున్.
సీ. పదియాఱువర్షముల్ పరమాయు వయ్యెడు, ధరణీశ కలియుగాంతమున వినవె
యేడు నెన్మిదియును నేండ్లప్రాయంబున, బ్రజ లుద్భవింతురు భామినులకు
ద్రవిణవిహీను లై దాత యొక్కఁడు లేక, యన్యోన్యతస్కరు లగుదు రెందు
నెఱిఁగెడువారును నెంతయుఁ గ్రూరు లై, చెనసి పాపంబు సేసెదరు నూవె
తే. యన్నవిక్రయ మొనరింతు రఖిలజనులు, వేదవిక్రయు లగుదురు విప్రవరులు
పణ్యయోనుల యగుదురు పద్మముఖులు, గష్టతర మైనయక్కలికాలవేళ. 302
తరువోజ.
ఉక్కున శూద్రు లత్యుగ్రులై కవిసి [6]యొక్కండ పెక్కండ్ర నుఱకచంపుటయు
దిక్కెవ్వరును లేక దీను లై వసుమతీసురుల్ నాలుగుదెసలఁ బాఱెదరు

1 నారుగపంటలు ; నారికపంటలు. 2 దైవనింద. 3 పరిగ్రహించె. 4 దోచి...బరస్ప రవైరంబు. 5 మహా మోహాతమము...లోభభూయిష్ట ; నరకభూయిష్ట. 6 యొండొండ.

మ్రుక్కడిచోరులు ముట్టి నిశ్శేషముగ ధనావలిఁ గొని మొగి వధింపంగ
స్రుక్కి కాకులయట్లు శూన్యులై చెదరి సొంపఱి యడవులు సొత్తురు జనులు.

క. శ్రుతిధర్మంబులు శూద్రులు, ప్రతిభం జెప్పంగ వినుచు [1]బ్రాహ్మణులు కదుఁ
మతి సెడి తత్సేవకులై, యతినిందితకర్మకారు లయ్యెద రధిపా. 304

మత్తకోకిలము. దేవతాయతనంబులుం జగతీసురావసథంబులుం
బావనాశ్రమభూములుం జెడి పాడగుఁ శుభవృక్షవ
ల్లీవనంబులు నాశ మొందుఁ గలిప్రచారమునందు దు
స్త్రీనివిహారము మద్యపానముఁ జెల్లుఁ బెల్లుగ నెల్లెడన్. 305

క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు, గురుఁడును శిష్యునెడ వంచకుం డగుమదినొం
డొరువులనొల్లరుబంధులు, పోరిఁబోరిఁగ అవ్వులగుఁబ్రజకుఁబొడమునుభయముల్.

తే. ఇవ్విధంబున ధర్మంబు లెల్ల [2]నపగ, తమునఁ బడ జను లెల్లను దల్లడిల్ల
బహువిధోత్పాతములుపుట్టుఁబార్థివేంద్ర, కడఁగితత్కలికాలసంక్షయమునందు.

క. క్రమమున రాష్ట్రములును నగ,రములును నాశంబు నొందు రక్షాచ్యుతులై
భ్రమియింతురు జను లతిదు, ర్గమగిరిసరిదంతికములఁ గడు నాతురులై. 308

కలియుగంబున విష్ణుండు గల్కిరూపంబున ధర్మంబు ప్రతిష్ఠించుట.

వ. అంతఁ గలియుగాంతంబునందు భువనవిదితం బయినశంబళగ్రామంబున విష్ణు
యశుం డనుపేర విష్ణుండు గల్క్యాత్మకుం డయి జనియించి సంస్మరణమాత్రన
వేదశాస్త్రంబులును సమస్తశస్త్రాస్త్రవిశేషంబులు నధిగమించి సార్వభౌముం
డయి. 309

మధ్యాక్కర. అసదృశతేజుఁడు బ్రాహ్మణానీకసహితుఁడై కడఁగి
వసుమతియందు నధర్మవర్తులై యున్నమ్లేచ్ఛులను
మసలక నిజశక్తిఁ జేసి మడియించి ధర్మంబు నిలిపి
వసునిభుం డొనరించుఁ బేర్మి వాజిమేధము నిష్ఠ యొప్ప. 310

క. ఘనుఁ డిల యెల్లను బ్రాహ్మణ, ధనముగ భాగించి యిచ్చి ధర్మయశోవ
ర్ధనుఁడై వార్ధకమున న, ఠ్యనఘుండు దపోవనంబునందు వసించున్. 311

వ. అతనిచేతం బ్రతిష్ఠితం బయినధర్మంబు ననుసరించి బ్రాహ్మణాదివర్ణంబులు సమ
ర్యాదంబులై వర్తింపం గలయవి దానసచేసి కృతయుగంబు ప్రాప్తం బగు నందు.

శా. ఆరామవ్రజచైత్యసద్మవనదేవాగారసౌమ్యంబులై
భూరిబ్రహ్మతపస్విసంకులములై పుణ్యాధ్వరారంభసం
భారోదారములై నితాంతఫలితభ్రాజిష్ణుసస్యంబులై
యారూఢస్థితి నెల్లదేశములు నొప్పారుం బ్రకాశంబుగన్. 313

క. సమయముతోడఁ గురియు వర్షములు గరము తేజ మెక్కి చరియించు నవ

---

1 బ్రాహ్మణజాతుల్, ధృతి సెడి. 2 నగ్గ, తమునఁ.

క్రము లై గ్రహంబు లారోగ్యము సౌఖ్యము సమధికముగఁ గలుగు నరులకున్.
వ. ఇది కృతయుగప్రవర్తనంబు త్రేతాద్వాపరయుగద్వితయంబునందును ధర్మంబ వర్తిల్లు నిట్టితెఱంగునం గాలగతు లనేకంబులు నాకుం బ్రత్యక్షసిద్ధంబు లయ్యె నీ వడిగినయతీతానాగతంబు లయినవిశేషంబు లెఱింగించితి నింక నొక్కహితోపదేశంబు సేసెద నాకర్ణింపుము. 315
క. ధరణీసురులకు నెప్పుడుఁ, గరముప్రియము సేయు మయ్య కౌరవవంశో
త్తర విప్రులు సంతుష్టిం, బొరసినఁ జేకుఱు నశేషపుణ్యఫలంబుల్. 316
సీ. సకలభూతములందు సదయాత్ముఁడవు గమ్ము, పాలింపు ప్రజల నీప్రజలఁ బోలె
వితతవృద్ధాచారవేది వై ధర్మంబు, సలుపుము దురితవర్జనము సేయు
మెఱుఁ[1]గమిఁ బాప మొక్కించుక దొడరినఁ, జట్టనప్రతికారశాలి వగుము
గర్వంబు విడువుము గరము ప్రియంబును, నిజమునుగా వచోనియతి నడపు
తే. కాలగతులెల్ల నెఱుఁగి యస్ఖలితబోధ, యుక్తుఁడవు గమ్ము భరతవంశోద్భవుఁడవు
నీవు గావున నత్యంతనిర్మలుఁడవు, ప్రాజ్ఞుఁడవు నీకు వేఱ చెప్పంగ నేల. 317
వ. అనిన విని మునీంద్రా నీయానతిచ్చినవాక్యంబు లన్నియు నవహితుండ నై వింటి నింతకు మున్ను నాయొపినతెఱంగున లోభమాత్సర్యాదిదుర్గుణంబులు పరిహరింతు నింకను భవదుక్తం బైనధర్మశాసనంబును బ్రయత్నంబునం బాలించెద నని • యతనికి యుధిష్ఠిరుండు ప్రణమిల్లి మఱియును బ్రాహ్మణప్రభావంబు వినువాఁడై యతనిం బ్రార్థించినఁ దద్విషయం బైనయితిహాసం బతనికి నమ్మహాముని యిట్లని చెప్పె. 318

మార్కండేయుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట.

చ. ఘనుఁడు పరిక్షితుం డనఁ బ్రకాశితుఁ డై నమహీవిభుండు భా
నునిభుఁడు భానువంశ్యుఁడు వినూతనకీర్తి యయోధ్య యేలువాఁ
డనుపముఁ డొక్కనాఁడు మృగ[2]యారతుఁ డై చరియించెఁ గానన
మ్మున నొకరుండ యిమ్ముల నపూర్వజవాగ్రహయాధిరూఢుఁ డై. 319
వ. ఇవ్విధంబునం బెక్కుమృగంబుల వధియించుచుఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడ.
ఆ. [3]మదభరాభిరామమృదులయానం బొప్పు, నల్లఁ బొలయుచును లతాంతరములఁ
గరము లీలఁ గమ్మవిరులు గోయుచునున్న, పువ్వుబోఁడి నొక్కపొలఁతిఁ గనియె.
క. కని యంతఁ గదిసి యాకా, మిని యొప్పులఁ జూడ్కి దగుల మీఱినతమకం
బున ననిమిషలోచనుఁ డై, జననాథుఁడు మదనబాణసంహతిఁ దూలెన్. 322
వ. అదియును నతిసుందరం బైనతదీయమూర్తివిభవంబునకు మెచ్చి సాభిప్రాయంబుగా నవలోకించె నంత నమ్మహీకాంతుం డక్కాంతకి ట్లనియె. 323

---

1 గని పాప. 2 యాతురుఁ డై చరియించుచుండెఁ గా, వనమున నొక్కరుండయి (బ్రభూతబలోగ్రహయాధి) తనర్చినవాఁడు హయాధి. 3 మదగజాభిరామ.

ఉ. ఎవ్వరిదాన వంబుజదళేక్షణ యేకత మిట్టు లేల [1]సీ
విప్వనభూమియందుఁ జరియించెదు నావుడుఁ దండ్రిపంపునం
దివ్వనభూమియందుఁ జరియించెద సద్వరుఁ గోరి కన్య నే
నెవ్వరిదానఁ గా వలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా. 324

వ. అనిన దాని ప్రగల్భవచనంబులకు నధికవిలోలుండై భూపాలుండు దనయభిలాషం బెఱింగించిన నమ్మగువ నన్నెన్నండును జలవిహారంబునకుఁ జోనుప కుండునది యట్లయిన నిన్ను వరియించెద ననిన వాఁడును దత్సమయంబున కొడంబడి దానిం దోడ్కొని పురంబునకుం జనుదెంచి యిష్టసుఖతత్పరుం డయి యుండె నంత నొక్కనాఁడు శరత్సమయంబునందు. 325

చ. అతులితపుష్పపల్లవఫలాన్వితభూరుహభూరివల్లరీ
వితతముఁ జారుకైరవనవీనసరోరుహషండమండలా
యతసరసీమనోహరము నైనపురోపవనంబునన్ సము
న్నతవిభవుండు వాసభవనంబు లొనర్పఁగఁ బంచి యిమ్ములన్. 326

క. దేవీసహితంబుగఁ బృథ్వీవరుఁ డవ్వనమునందు విహరించె ఘనాం
తావసరవాసరంబుల, భావితపద్మవనపవనపరిచితుఁ డగుచున్. 327

వ. అంత నొక్కనాఁడు నితాంతఘర్మజలకణకరాలితశరీరుండై ప్రియాసమేతంబుగా వాసగృహంబు వెలువడి తత్సమీపంబున నతిమనోహరం బయినకమలాకరంబు గని దానితీరంబున నయ్యుగ్మలి నునిచి దాను గృతావగాహుండై. 328

క. మేలై యున్నది జలము వి,శాలనయన చెమట [2]వోవఁ జయ్యన దేహ
క్షాళన మొనరింపు మనిన, నాలేమ దరస్మితాననాంబుజ యగుచున్. 329

ఆ. మడుఁగుసొచ్చి మునిఁగి మాయమైపోయిన,నద్భుతాత్ముఁ డగుచు నవనివిభుఁడు
మడుఁగు గలయ వెదకి మానినిఁ గానక, జలములెల్ల వెడలఁ జల్లెఁ గడఁగి. 330

వ. ఇట్లు సల్లియందు మండూకంబు లనేకంబు లున్నం జూచి యివి మత్ప్రియాంగనను మ్రింగినవి గా కేమి యని కలుషించి యనుచరులం బిలిచి నాకుఁ బ్రియంబు సేయ వలసినవారు గలిగినం బుడమిం గలకప్పల [3]నెల్లం బొడ వడంచి రండని పంచిన నలుదిక్కులకుం జని తదీయకింకరవర్గంబు. 331

చ. కొలఁకుల వాఁగులన్ నదులఁ గ్రోవుల బావుల నిర్ఝరంబులం
గలయఁగ రోసి రోసి వడిఁ గప్పలఁ గుప్పలుగా వధించుచో
నలుగుల మండుభేకనివహంబు గనుంగొని భేకనాయకుం
డలఘుతపస్విరూపమున నానృపుపాలికి వచ్చి యిట్లనున్. 332

---

1 సే, డివ్వనభూమి...సద్వరుఁ గోరుకన్య. 2 యెడలఁ జయ్యన. 3 నెల్లం జంపునది యనిన వారును నట్ల సేయం గడంగిన భేకనాయకుం డప్పుడ తపస్విరూపంబున నానృపుపాలికి వచ్చి యిట్లనియె. అని యొకప్రసిద్ధవ్రాతప్రతియందున్నది.

ఉ. అక్కట లోక మెల్ల నగ నాఁడికప్పలఁ జంప [1]నేల యిం
దెక్కడిపెంపు గల్గుఁ బృథివీశ్వర కోపము డింపు కప్పలం
జక్కనిచూడ్కిఁ జూడు మిది చాల నధర్మము నావుడుం విభుం
డెక్కడిమాట నాసతికి నెగ్గొనరించెఁ గడంగి భేకముల్. 333

క. నాయిష్టవనిత మ్రింగిన, మాయపుఁబుర్వు లివి వీని మడియింతు మునీం
ద్రా [2]యుడుగుము నీ వనుటయు, నాయన యత్యంతదుఃఖితాత్ముం డగుచున్.

వ. ఏను మండూకనాయకుండ నాయు వనువాఁడ నమ్మగువ నాకూఁతురు సుశో
భన యనునది దానిచేత ననేకులు చేలుపడిరి నీ వెంతవాఁడ వనిన నప్పరిక్షితుం
డల్లని నాకు నమ్మొలఁతుకఁ దెచ్చి యొప్పింప వలయు నని ప్రార్థించిన నతండు
నవ్వుచు నవ్వామనయనం దనతలంపున రావించి యారాజునకు నిచ్చి దానిం
జూచి కోపించి నీవు గడుంజెట్టవు ప్రసిద్ధు లగురాజులం [3]బెక్కండ్రం బెనవెట్టి
తివి గావున నీకుం బుట్టెడుకొడుకులు గపటవర్తను లయ్యెదు మని కూఁతు శపి
యించి మండూకరాజు నిజేచ్ఛం జనియెఁ బరిక్షితుండును సంప్రాప్తమనోరథుం
డయి సుశోభనయందుఁ గ్రమంబున శలుండును దలుండును వలుండును నను
మువ్వురుగొడుకులం బడసి యం దగ్రజుం డయినశలు నభిషిక్తుం జేసి తపోవ
నంబున కరిగె నంత. 335

క. శలుఁ డొక్కనాఁడు కనకో, జ్జ్వల మగురథ మెక్కి వేఁట నని పెక్కుమృగం
బులఁ జంపఁగ నొక్కమృగం, బలఘుతర[4]శితాస్త్రవిద్ధ మై వెసఁ బఱచెన్.

ఆ. ఇట్లు వఱచుటయును నెంతయురయమున, నమ్మృగంబు వెనుక నరిగి యరిగి
యెయిద లేక ధారుణీశుండు సారథిఁ, బదరి తేరు వేగ పఱపు మనియె. 337

సీ. అనవుడు సూతుఁ డిట్లను దేవ మన మెంత, దఱిమిన మృగము దద్దయు జవంబు
గలదు రథ్యంబులు గడుఁగొని కూడంగఁ, జాలవు వలవనిజాలి యేల
మన తేరిహారులు వామ్యము లైన నమ్మృగ, మగపడు లేకున్న నలవి గాదు
నా విని వామ్యముల్ నాఁగ నెవ్వనిహయం,బులు సెప్పు మనియె నబ్భూవిభుండు

తే. వామదేవమహామునివరునిహరులు, వామ్యములు నాఁగఁ జనువనివాఁడు సెప్పె
నతనియాశ్రమ మెచ్చట నచటి కిపుడ, తేరు వోవ నిమ్మనియె ధాత్రీవిభుండు.

వ. వాఁడును రథంబు సత్వరంబుగా వామదేవునాశ్రమంబునకుం బఱపినం జని
యాతం డాతపోనిధిం గని నమస్కరించి మునీంద్రా నాచేత నేటువడి యొక్క
మృగంబు రయంబునం బఱచె నమ్మృగంబు నెయిది వధియింపవలయు భవదీయ
హయంబుల నీవె యనిన నతండు నీవు కృతకార్యుండ వై మాహయంబులం

---

1 దీన నీ, కెక్కడి...నామదికి నెగ్గొన. 2 యరుగుము. 3 జిక్కులం బెట్టితివి. 4 శరా
గ్రవిద్ధ మై. ఇప్పద్యమునకు వెనుక 'వ. ఇట్లు పరచుటయును నమ్మృగంబును బొలియింతు రను
నాగ్రహంబున. ఆ. అతఁడు సలము మిగిలియత్యంతరయమున' అని యొకప్రతి.

దడయక యొప్పింపవలయు నట్లయినం గొని పొమ్మనిన వల్లె యని వామ్యంబు
లం గొని రథయుక్తంబులం గావించి తదీయజవంబునకు మెచ్చుచు ముహూర్త
మాత్రంబునఁగూడముట్టి యమ్మృగంబు సమయించి మగిడి నిజపురంబునకువచ్చి.

మత్తకోకిలము. రాజయోగ్యము లైనయీహయరత్నముల్ జవసత్త్వవి
భ్రాజితంబులు వాని కేటికిఁ బాఱువానికి నంచు నా
రాజు రాజసబుద్ధి నంతి[1]పురంబునం దిడఁ బంచె న
వ్వాజియుగ్మము వేడ్క నూనినవాఁడు దోస మెఱుంగునే. 340

వ. అట వామదేవుండును దనయశ్వంబుల శలుండు గొనిపోయి మగుడ నొప్పిం
పక తడయుటయు నాత్మగతంబున. 341

తే. రాజపుత్త్రుండు బలియుండు[2]రాజసుండుఁ, గొండు కాతండు వేడుకఁగొనుచు నరిగె
నశ్వములఁ గ్రమ్మఱఁగ నిత్తు ననువిచార, మెవ్విధంబున నతనికి నేల కలుగు.

వ. అని శంకించి నిజశిష్యుం డాత్రేయుం డనువానిం జూచి శలుండు మనవామ్యం
బులం గొనిపోయి యొక్కమాసం బరుగుదెంచె వాఁడును దనయంతఁ దెచ్చుట
గలుగ నేరదు నీ వరిగి మనతురంగరత్నంబులం గొని రమ్మని పంచిన నతం డప్పు
డ కదలి యయోధ్యకుం బోయి. 343

క. మనుజపతిఁ గాంచి యాతఁడు, మునిపతి పుత్తేర నధిప ముఖ్య[3]యిచటి కేఁ
జను దెంచితి మాహయముల, నెనసిననెయ్యంబుతోడ నిమ్మనియెఁ దగన్. 344

క. అనవుడు శలుఁ డి ట్లనియెం, జను నినుఁ బుత్తేర నతఁడు సాలుదు వీవుం
గొనిపోవఁ దురంగంబులఁ, జను మీదుర్భాషితములు సైఁపవు మాకున్. 345

వ. అనిన నమ్మునికుమారుండు గ్రమ్మఱి చని గురునకు నవ్విధం బెఱింగించిన వామ
దేవుండు క్రోధపరీతచేతస్కుండై శలునిపాలి కరిగి యి ట్లనియె. 346

క. ఇమ్ము నరేశ్వర మాతుర, గమ్ముల నీకార్య మయ్యెఁ గాదే కడులో
భమ్మున నొండ్లవి సొమ్ములు, రమ్మనిరక వచ్చునే యెరవు నత మగునే. 347

క. పరధనహరణము దురితము, పరికింపుము వరుణుచేతిపాశంబుల ని
ష్ఠురముగఁ గట్టువడకు ని, ర్భరనరకకృశానుశిఖలఁ బడకుము మీఁదన్. 348

చ. అనుటయు నాతఁ డి ట్లనియె నాఁఅడివిప్రుల కేల యశ్వముల్
ఘనతరసత్త్వమూర్తు లనఁ గాఁ దగు నెడ్లను రెంటి నిచ్చెదక
విను మటు గాక బల్లిదపువేసడముల్ వలతేని నిత్తుఁ గై
కొనుము కడంగి వామ్యములఁ గోరక పొమ్మడియాస లేటికిన్. 349

క. [4]అనిన నిది యేటిమాటలు, వినువారలు నవ్వ నకట విప్రులధనముల్

---

1 పురంబున న్నియమించె. 2 రాజసమునఁ, గోడెకాఁడు వేడుకఁబడి గొనుచు (గొంచుఁ
బోయె) నరిగె. 3 యిచటికిం, జను. 4 అనిన విని.

[1]గొని వేఱ యొండు నిచ్చెద, నను టిది యేనాఁటిచందమని ముని పెలుచన్.
క. పలుకుటయు నలిగి శలుఁ డి, ప్పలుగుఁదపసి నంటఁ గట్టి పటుశూలములం
బొలియింపుఁ డనుచు భీకర, బలుల నియోగించెఁ దనదుపార్శ్వజనములన్.
వ. అంతయుం జూచి వామదేవుండు ఘనరోషభీషణప్రహాసదుర్నిరీక్షణరూక్షము
ఖుం డగుటయు నాక్షణంబ ఘోరాకారు లగురాక్షసు లనేకులు వుట్టి నిశా
తశూలంబుల నాభూపాలుం బొడిచి కాలగోచరుంజేసిరి మునీంద్రుండు నిజేచ్ఛం
జనియెఁ దదనంతరంబ శలానుజుండు దలుం డనువాఁడు నిజరాజ్యపట్టబద్ధుండై
సుఖుం బుండఁ గొండొకకాలంబునకు వామదేవుండు సనుదెంచి వానిం గని
మహాత్మా నీవు ధర్మపరుండవు ధర్మువు దప్ప నోడు దేని నాహయంబుల నిమ్ము
నుటయు దలుం డలిగి నిజసమీపంబున నున్నసారథిం జూచి యిట్లనియె. 352
సీ. కడుఁ గ్రొవ్వి తేఁకువ సెడియె నీపాఱుండు, వీఁకమై నిప్పుడు వీనిఁబొమ్ము
వ్రియ్యంగఁ జేసెదఁ జయ్యన విషదిగ్ధ, సాయకమును శరాసమ్ముఁ దెమ్ము
నావుడు నమ్మహీదేవుండు నగుచు ని, ట్లనియె న న్నేయఁ దెమ్మనిన విశిఖ
మంతఃపురంబున సంతసంబున నున్న, ఘను భవత్సుతుఁ దున్నుఁగాక యిపుడ
తే. యనఁగఁ దదనంతరంబ ఘోరాస్త్రనిహతుఁ
డయినయబ్బాలుఁ గొంచు హాహారవంబు
లెసఁగ నంతిపురంబువా రెల్ల వచ్చి
రది ఘుర్ణివంబుగఁ గనియును నవ్విభుండు. 353
వ. [2]కోపాటోపావేశమానమానస విగ్రహుం డగుచుఁ దనదురాగ్రహంబు విడు
వక తనసమీపవర్తులం జూచి. 354
మ. వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీవిప్రుఁ దురాలాపు దు
ర్జనునిం దున్మెద నస్మదీయసుమహచ్చాపోగ్రనిర్ముక్తబా
ణనిపాతచ్ఛిదురాంగరక్తజలశోణక్షోణిసంసిక్తుఁ గాఁ
గనుఁడీ యీదురితాత్ము నంచు నతిశీఘ్రప్రాప్తకోదండుఁ డై. 355
క. శర మరిఁబోయుటయును ద, త్కరయుగ్మము బాణకార్ముకంబులతోఁ జె
చ్చెర సంస్తంభము నొందుడు, నరనాథుఁడు విస్మయోపనతమానసుఁ డై. 356
క. పుల్లవడి చలమురోషముఁ, బొల్లయు నై చనఁగఁ గొంతప్రొద్దు మొగమునఁ
వెల్లఁదనము గదుర నిలిచి, యెల్లజనులు వినఁగ మఱియు నిట్లని పలికెన్. 357
ఉ. ఆడితిఁ [3]బేలమాట లవి యన్నియు వమ్మయి పోయె నస్త్రసం

---

1 గొనివెట్టి యొండు నిచ్చెద (గొని యొంటి వేఱ నిచ్చెద) నను టిదియే వాని చంద మని. ఈపద్యమునకు వెనుక నొకతాళప్రతిలో, 'వ. ఇట్లు మఱియునఁ బరుషంబులు వలికిన.' యను వచన మున్నది. 2 కోపఘూర్ణమానవిగ్రహుం డగు; కోపాటోపావేశమానవిగ్రహుం డగు. 3 బె క్కుమాట లవి యన్నియు వమ్మునఁ బోయె,

తాడనశక్తి గీడ్పడియెఁ దథ్యము బ్రాహ్మణశక్తి యెక్కుడే
నోడుదు వామదేవునకు నోజనసంఘములార సజ్జనా
మ్రేడితకీర్తి నిమ్ముని నమిత్రనిషూదను [1]నాశ్రియించెదన్. 358
వ. అని యివ్విధంబున నతం డేటు దప్పిన జోహారు వెట్టుటయుఁ దదీయబంధుమి
త్రజనంబులు భయసంభ్రమంబులతో నమ్మునినాథు శరణు సొచ్చి యనున
యించినఁ బ్రసన్నుండై యమ్మహాత్ముండు దత్కరయుగస్తంభనంబు మానననుగ్రహించి తదీయనందనుప్రాణంబు లొసంగె నంత నమ్మహీకాంతుండు నిజభా
ర్యాబంధుజనసహితంబుగా నతనికిఁ బ్రణమిల్లి హయంబులఁ దెచ్చి యొప్పించినం గైకొని వామదేవుం డరిగె నిట్టిది బ్రాహ్మణప్రభావం బని చెప్పిన విని.
క. మునిపతికి మ్రొక్కి కుంతీ, తనయుఁడు మీకంటె వృద్ధతముఁ డగుపురుషుం
డనఘా కలఁడె జగమ్మున, నని యడిగిన నాతఁ డిట్టు లని యెఱిఁగించెన్. 360
క. ఘనుఁ డింద్రద్యుమ్నుం డను, జనపతి గలఁ డాతఁ డింద్రసదనమున ముదం
బున నుండఁగ బహుకాలం, బున కాతని కీర్తిలోకమున మాయుటయున్. 361

మార్కండేయుఁడు ధర్మజునకు నింద్రద్యుమ్ను చరిత్రము సెప్పుట.

తే. అమరులిచ్చోట నుండ లే వరుగుమనుచు, నుర్విఁద్రోచిన నతఁడు నాయున్నకడకు
నర్థిఁజనుదెంచి యిట్లనుననఘ నన్ను, నిద్ధపుణ్యు నింద్రద్యుమ్ను నెఱుఁగుదయ్య.
సీ. అనుడు నిట్లంటి నే నయ్య నిన్నెఱుఁగంగఁ, జాల నయ్యెడ హిమశైలశృంగ
వాసి యై యుండు ప్రావారకర్ణుం డను, పేరిఘూకము గడుఁబెద్ద యదియు
నాకంటె నిన్ను నిర్ణయముగ నెఱుఁగుఁ బొ, మ్మనుటయు నన్నుర మ్మనియె నతఁడు
ఘనరసాయనఘుటికాప్రయోగంబున, దేహతాపంబు వర్ధించె నేఁడుఁ
తే. గదలి రాఁజాల నేనంటిఁగడఁగి యన్న, రేంద్రుఁ డశ్వమైననుఁ బ్రీతి నెత్తికొనుచు
నయ్యులూకముపాలికి నరిగి నన్ను, నడిగినట్టుల దానిఁ దా నడుగుటయును.
వ. అదియునుం గొండొకసేపు దలపోసి చూచి యేను నిక్కువంబుగా నిన్నెఱుంగ
నేర నింద్రద్యుమ్నుం బనుకొలనియందు నాళీకజంఘుం డను పేరిబకవల్లభుండు
వసియించు నవ్విహంగంబు నాకుఁ బెద్ద నిన్నెఱుంగు నరుగు మనిన నమ్మనుజపతి
నాతోడఁగూడ నయ్యులూకంబు మోచికొని నాళీకజంఘునొద్దకుం జని తన
పేరు సెప్పి నన్నెఱుంగుదే యనిన నదియు నేనిన్నెఱుంగం జాల నాకంటెఁ
జిరకాలజీవి యైనయకూపారుం డనుకచ్ఛపంబు గల దదియును నిక్కొలన నుండు
నజ్జలచరము నిన్నెఱుంగంజాలు నడిగి చూతము గాక యక్కమఠంబుఁ జేర్కొని
యిది యొక్కసందేహంబు నిర్ణయించుటకయి యీయార్యజనంబులు నిన్ను
గుఱించి వచ్చినవారు నీవు సను దేర వలయు నని వేఁడుటయును. 364
తే. కొలను వెలువడి చనుదెంచెఁ గూర్మవిభుఁడు

1 నాశ్రయింపరే.

